భారతీయ సాహిత్య నిర్మాతలు

# రాజా రామమోహన్ రాయ్

మూలం:

సౌమ్యేంద్రనాథ్ ఠాకూర్

అనువాదం:

కె. రామలక్ష్మి



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

# వి ష య సూ చి క

# వేకువకు ముందు చీకటి

ఆధునిక భారతదేశ చరిత్రలో అది అంధకారంతో నిండిన కాలం ప్రాచీన సంఘం, పరిపాలనా విధానం ముక్కలు చెక్కలుగా చెదరిపడి పోయాయి; ప్రాచీనమైన సాంఘిక విధానపు శిథిలాలు అన్ని వైపులా చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. ఆ శిధిలాలను తొలగించి శుభ్రం చేయడానికీ, పాత పునాదులపైన పునర్నిర్మాణం ప్రారంభించడానికి అప్పటికింకా ఏ శక్తీ రూపొందలేదు. మృత సంప్రదాయాలూ, శిలారూపంలో బిగుసుకుపోయిన ఆచారాలూ, అవివేకంతో కూడిన స్వపక్ష దురభిమానమూ కలిసి దేశంయొక్క జీవనవాహినికి అడ్డుపడ్డాయి. జ్ఞానం నశించింది. అది కర్కశమైన అంధకార యుగం. గొడ్డుబారిపోయి కాటకంతో అలమటిస్తున్న ఆ క్షణాన రామమోహన్‌రాయ్ అవతరించాడు.

మానవ నాగరకతా చరిత్రలో అదృశ్యంగా పనిచేసే కాలశక్తి యొక్క గాఢమైన సృజనాత్మక శక్తికి మహాపురుషులు కేంద్ర బిందువులు. జాతియొక్క సాంస్కృతిక చరిత్రలో నిర్గమనం అవిచ్ఛిన్నతకు విరోధమైనది కాదు; మానవ వ్యక్తిత్వం చరిత్రను సృష్టిస్తున్నట్టే మానవ వ్యక్తిత్వాన్ని చరిత్ర నియమబద్ధం చేస్తుంది.

ఆ కాలంయొక్క కీలక కార్యాన్ని అర్థం చేసుకోవడానికి తోడ్పడే సామర్థ్యంలోను; చారిత్రక ప్రవాహంయొక్క సారాన్ని గ్రహించడానికి ఉపయోగపడే శక్తిలోను; చివరగా - కార్యసాధనకోసం గరిష్ఠమైన సృజనాత్మక కృషిచేయడానికి దోహదంచేసే స్థిరమైన, ధీరమైన నిర్ణయంలోనూ మానవ వ్యక్తిత్వంయొక్క సఫలత, గొప్పతనం ఇమిడి ఉంటాయి. ఉన్నతస్థాయికి చెందిన సృజనాత్మకకృషి చేస్తున్నప్పుడు మానవవ్యక్తిత్వం పరస్పర విరుద్ధగుణాల విచిత్రమైన కలయికగా కనిపిస్తుంది. అదెంతగా

వ్యక్తిగత సంబంధం లేనిదిగా రూపొందుతుందో అంతటి గాఢమైన వ్యక్తిగత శ్రద్ధతోనూ కనిపిస్తుంది. ఆశయాన్ని మలినం చేయగల అహంకారానికి ఏమాత్రమూ చోటివ్వకపోవడాన్ని వ్యక్తిగతసంబంధం లేకపోవడంగా పరిగణిస్తాము; ఒక ప్రత్యేక వ్యక్తిలో ఆ ఆశయం—భౌతిక రూపంలో వ్యక్తం కావడాన్ని వ్యక్తిగతసంబంధంగా భావిస్తాము. ఇది మానవ చరిత్రలో ఒక అపూర్వమైన ప్రక్రియ. కాని, అది తరచుగా సంభవిస్తూనే ఉంటుంది.

18 వ శతాబ్ది ఉత్తరార్ధంలో భారతీయ చారిత్రక రంగస్థలంమీద రామమోహన్‌రాయ్ అవతరించినప్పుడు - ముస్లిం పరిపాలన నేలకూలిపోతున్నది. భారతదేశానికి వర్తకులుగా వచ్చిన బ్రిటిష్‌వారు నెమ్మదిగా పరిపాలకులుగా పరిణమిస్తున్నారు. అప్పటికి పదిహేను సంవత్సరాల ముందే - అంటే, 1757 లో ప్లాసీ యుద్ధం బెంగాలు భవిష్యత్తును నిర్ణయించింది. అప్పటికి పరిస్థితి అల్లకల్లోలంగా ఉన్నా, ఆ పరిస్థితి మధ్య రానున్న కొత్త ధోరణులు నెమ్మదిగా రూపొందుతున్నాయి. బ్రిటన్-పాశ్చాత్య ప్రపంచానికి ప్రతినిధిగా భారతదేశానికి వచ్చింది; అది కేవలం వర్తకంకోసమే రాలేదు. అది - భారతదేశాన్ని నిద్రనుండి మేల్కొల్పి, ప్రాచీన భారతచరిత్ర ప్రవాహగతిలో కొత్తదైన ఆలోచనా తరంగాన్నీ, ఉత్సాహాన్నీ వెల్లివిరియజేయడానికి చరిత్ర నియమించిన పరికరంలా వచ్చింది.

భారతదేశంలో ముస్లింలు ప్రవేశించాక, జ్ఞానసంపన్నులైన మహాపురుషులెందరో అవతరించారు. వారు హిందూ తాత్త్విక ప్రపంచానికీ, ఇస్లాముకూ మధ్య చక్కని కలయికను రూపొందించవలసిన చారిత్రాత్మకమైన అవసరాన్ని తీర్చడానికి అవతరించారు. ఈ మహాప్రయత్నంలో దాదు, కబీర్, గురునానక్‌వంటి మార్గదర్శకులెందరో పాల్గొన్నారు. ఈ ప్రయత్నం విడివిడిగా ఉన్న మూలపదార్థాలను భౌతికమైన బంధం ద్వారా కలపడంవల్ల నెరవేరదు. అది సంయోగపద్ధతి ద్వారా నెరవేరవలసిందే. ఈ సంయోగపద్ధతి వివిధ మూలపదార్థాలలో కనిపించే పరస్పరం ఆధార

పడి ఉండే తత్త్వాన్ని సూచిస్తుంది. ఆ మూలపదార్థాలు సంయోజన, సంబంధం, సమైక్యతలతో కూడిన ఆంతరంగిక విధానం ద్వారా ఒకదాని కొకటి పెనవేసుకుని ఉంటాయి. పాశ్చాత్య ప్రపంచంతో ఈ సంయోగ సమైక్యతను సాధించడమే అప్పటి కాలవిభాగపు ప్రధాన కర్తవ్యం. చరిత్ర లోని ఆ నిర్ణీతయుగంలో భారతదేశపు భవిష్యత్తును నిర్ణయించే భారం రామమోహన్‌రాయ్‌కి లభించింది.

## జననం - తొలి పోరాటం

1772 మే నెల 22 వ తేదీ రామమోహన్‌రాయ్ - బెంగాలులోని రాధానగర్ అన్న గ్రామంలో జన్మించాడు ఆ గ్రామం మొదట బర్ద్వాన్ జిల్లాలో భాగంగా ఉండేది. ఆ తర్వాత అది హుగ్లీ జిల్లాలోని ఉపభాగ మైన ఆరంబాగ్‌లో భాగమైంది. సుసంపన్నమై, సుప్రసిద్ధమై ఉన్న ఖనకుల్ కృష్ణనగర్ అనే గ్రామానికి ఉత్తరభాగాన ఉన్న రాధానగర్ చాలా చిన్న గ్రామం. ఖనకుల్ కృష్ణనగర్ ఆ రోజుల్లో భారతీయ సంస్కృతి కేంద్రంగా ప్రసిద్ధమైంది. రామమోహన్‌రాయ్ ఒక సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. ఆ కుటుంబంవారు చాలాకాలం ముర్షీదాబాదు పరిపాలకులైన మహమ్మదీయులదగ్గర ఉద్యోగం చేశారు. రామమోహన్‌రాయ్ తండ్రి రమాకాంతరాయ్. ఆయన శాస్త్రప్రకారం నడచుకొనే సనాతన హిందువు. రామమోహనుడి తల్లి ఫూల్‌ఠాకూరాణి తెలివిగల ఇల్లాలు. ఆమె స్థిరమైన సౌశీల్యం కలది.

ఫూల్‌ఠాకూరాణి సంతానం - రామమోహన్, జగ్‌మోహన్ అనే ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. రామమోహన్ ప్రాథమిక విద్యను గ్రామంలోని బడిలోనే నేర్చుకున్నాడు. ఆయన ఒక మౌల్వీదగ్గర పారశీక భాషకూడా నేర్చుకున్నాడు. అలా గ్రామంలో ఇంటిపట్టున కొన్నేళ్ళు విద్యాభ్యాసం చేసిన రామమోహన్‌రాయ్‌ని ఆయన తండ్రి పట్నాకు పంపించాడు. ఆ రోజుల్లో పట్నా ఇస్లామ్ విద్యకు కాణాచి. అక్కడ

రామమోహనుడు అరబ్బీ, పారశీక భాషలు నేర్చుకొన్నాడు. కురానునీ, ఇస్లామ్ వేదాంతాన్నీ చదివాడు. అరబ్బీ అనువాదాల రూపంలో లభ్యమై నంతమేరకు యూక్లిడ్, అరిస్టాటిల్ రచనలను అధ్యయనం చేశాడు. కురాన్‌లోని ప్రజాస్వామ్య బోధనలు ఆయనపై తమ ప్రభావాన్ని ఎంత గానో ప్రసరించాయి; అరబ్బీ ఆలోచనావ్యవస్థలో కనిపించే తార్కిక ధోరణి అభివృద్ధి ప్రభావంకూడా ఆయనమీద పనిచేసింది. అందులో ప్రధానంగా ముతజిలాల* ఆలోచనావిధానం, సూఫీల వేదాంతం ఆయనపై ఎంతగానో పనిచేశాయి.

పట్నానుంచి తిరిగివచ్చాక రామమోహనుడు హిందూ సంఘంలో కనిపించే విగ్రహారాధన గురించీ, మూఢవిశ్వాసాల గురించీ ఒక పరి శోధనాగ్రంథం వ్రాయడానికి పూనుకున్నాడు. సనాతన దృక్పథంగల రమాకాంతరాయ్ రామమోహనుణ్ణి ఇంటినుంచి వెళ్ళిపొమ్మన్నాడు. రామ మోహనుడు ఇల్లు వదలిపెట్టి ఒక గమ్యమంటూ లేకుండా దేశదిమ్మరిలా ఒకచోటునుంచి మరోచోటికి వెళ్ళసాగాడు. అలా వెడుతూ ఆయన టిబెట్ చేరుకున్నాడు. ఆయన అక్కడ బౌద్ధమతంలోకి వ్యాపించిన విగ్రహారాధన గురించి విమర్శించి టిబెట్టులోని లామాల అసంతృప్తికి గురి అయ్యాడు.

తన జీవితంలోని ఆ రోజులగురించి రామమోహనుడు తన 'స్వీయ చరిత్ర కథనం'లో ఇలా పేర్కొన్నాడు: "నేను పదహారేళ్ల వాణ్ణిగా ఉన్నప్పుడు నేను హిందువుల విగ్రహారాధనయొక్క సార్థకతను ప్రశ్నిస్తూ ఒక రచన చేశాను. అదీ, దాంతోబాటు అప్పటికే ఆ విషయంగురించిన నా అభిప్రాయాలూ కలిసి నాకూ నా సన్నిహిత బంధువులకూ మధ్య విరోధభావాన్ని కలిగించింది. నేను నా ప్రయాణాలు ప్రారంభించి భారత దేశపు సరిహద్దులలోనూ, దానికి వెలుపలా ఉన్న వివిధప్రాంతాల పయనించాను."

అలా కొన్ని సంవత్సరాలబాటు పయనించాక రామమోహనుడు

*క్రీ శ. 8 వ శతాబ్దంలో వాసిల్-బి-అటా, అమిర్-బి-ఉబైద్ ముతజిలా హేతువాద ఉద్యమాన్ని బస్రాలో ప్రారంభించారు.

వారణాసి (కాశి) చేరుకున్నాడు. అక్కడ ఆయన చాలా యేళ్ళపాటు హిందూ వేదాంతాన్ని అభ్యసించాడు. 1803 లో రామమోహనుడి తండ్రి మరణించాడు. ఆ తర్వాత కొంతకాలానికే ఆయన ముర్షీదాబాదుకు తరలి వెళ్లాడు.

ముర్షీదాబాదులో ఉన్నప్పుడు ఆయన 'తుహ్ఫత్-ఉల్-మువాహ్-హిదీన్' (ఏకేశ్వరోపాసకులకు ఒక కానుక) అనే గ్రంధాన్ని పారశీక భాషలో వ్రాసి, దానికి అరబ్బీ భాషలో పీఠిక వ్రాశాడు.

ఆ పీఠికలో రామమోహనుడు ఒక 'పరతత్త్వం' ఉన్నదన్న విషయాన్ని మానవజాతి అంగీకరిస్తుందనీ, ఆ పరతత్త్వానికి విభిన్నమైన లక్షణాలను అన్వయింపజేయడంలోనే పరస్పర భేదాభిప్రాయాలు వస్తున్నాయనీ సూచించాడు. మతవాదుల సంకుచిత మనస్తత్వాన్ని ఖండిస్తూ ఆయన ఇలా వ్రాశాడు: "నేను ప్రపంచంలోని మారుమూల ప్రాంతాలన్నిటా ప్రయాణం చేశాను. మైదాన ప్రాంతాలలోను, పర్వత ప్రదేశాలలోనూ ప్రయాణం చేశాను. ఆ ప్రాంతాలలోని ప్రజలు సృష్టికి కారణం, దాన్ని నడిపేశక్తి అయిన ఒక 'పరతత్త్వం' ఉనికిని సాధారణంగా నమ్ముతున్నారు. కాని, ఆ పరతత్త్వానికి విచిత్రమైన లక్షణాలను అన్వయింపజేయడంలో వారికి ఏకాభిప్రాయంలేదు. నిషిద్ధమైనవీ ('హరామ్'), న్యాయసమ్మతమైనవీ ('హలాల్') అయిన మతసూత్రాలకు సంబంధించిన వివిధ కార్యకలాపాలను అనుసరించడంలోను వారిలో ఏకాభిప్రాయంలేదు. ఈ అనుమానం ద్వారా నేనొక నిర్ణయానికి వచ్చాను. ఒక శాశ్వత పరతత్త్వం గురించి అన్వేషించడం మానవసహజమైన విషయం. ఈ అన్వేషణ మానవజాతిలోని ప్రతివ్యక్తికీ ఉమ్మడి అయినదే. మానవజాతిలోని వేర్వేరు తెగలకు చెందినవారు ఒక ప్రత్యేకదైవాన్నో, దేవతలనో పూజించడానికీ, ఆ దేవతలకు కొన్ని ప్రత్యేక శక్తులున్నట్టు భావించడానికీ, విచిత్రమైన పూజావిధానాన్నో భక్తినో అనుసరించడానికీ మానవజాతిలో పెంపొందిన ఒక విపరీత ధోరణి కారణం. ఈ ధోరణి కలగడానికి మానవజాతి అలవాట్లు, అభ్యాసమూ కారణాలు."

ఈ గ్రంథంలో రామమోహనుడు మతాలకూ, మతానుభావాలకూ హేతువాద మార్గాన్ని అన్వయించే సమస్యగురించి వివరించాడు. ఆయన "తెగలలోను, వ్యక్తులలోను ప్రకృతికి సంబంధించిన వాంఛలఫలితంగా ఏర్పడే సహజగుణాలనూ, అలవాట్లవల్ల తరచుగా కలిగే సంబంధంవల్లా ఏర్పడే గుణాలనూ వివేకంగా విడమర్చుకోగల వ్యక్తుల పరిస్థితి ఆనంద కరమైనది. ఆ వ్యక్తులు వివిధప్రజలు అనుసరించే వివిధ మతాలలోని విభిన్న సిద్ధాంతాల సత్యాసత్యాలను గ్రహించడానికి తమ శాయశక్తులా ప్రయత్నించడానికీ, అందరూ అంగీకరించే సిద్ధాంతాలనూ, వాటిని స్థిరంగా బోధిస్తున్నవారి స్థితిగతులనూ పట్టించుకోక నిష్పక్షపాతంగా ప్రవర్తించ డానికీ కూనుకోవాలి." అని వ్రాశాడు.

ఆయన మతాలగురించి తులనాత్మకంగా పరిశీలించవలసిన అవ సరంగురించి నొక్కిచెబుతూ, ప్రపంచం మొత్తంమీద ఏకేశ్వరోపాసన సాధించిన సాధనగురించి పేర్కొన్నాడు. "మానవజాతి స్వభావంలో అంతర్గతమైన ఒక శక్తి ఉంది" అని ఆయన వ్రాశాడు. "స్థిరమైన మనస్తత్వంగల ఏ వ్యక్తి అయినా ఒక మతంయొక్క సిద్ధాంతాలను అనుసరించడానికి ముందో, వెనుకో ప్రధానమైనవీ, అప్రధానమైనవీ అయిన ఆ మతపు వివిధ సిద్ధాంతాల స్వభావంగురించి నిష్పక్షపాతంగా, న్యాయధోరణిలో పరిశీలన జరపాలి; అలా జరిపితే అతను ఏది సత్యమో, ఏది అసత్యమో గ్రహించగలడు. సత్యమైన విషయంఏదో అసత్య విషయంఏదో తెలుసుకోగలడు. ఒక్కొక్కప్పుడు భౌతిక, మానసిక కష్టాలకు గురిచేసి, తక్కిన మతాలవారితో తలపడేలాచేసే మతసంబంధ మైన పక్షపాతాలకు మతం విధించే పనికిమాలిన నిర్బంధాలుకూడా కారణ మవుతాయి. అటువంటి నిర్బంధాలకు లోబడకుండా సత్యవివేచన చేసే వ్యక్తి -'విశాల విశ్వంయొక్క చక్కని వ్యవస్థకు కారణమైన 'ఒక్క పరతత్త్వం' వైపు మొగ్గుచూపి, సంఘం బాగుకోసం కృషిచేస్తాడు" అని ఆయన వ్రాశాడు.

గుడ్డినమ్మకం, కార్యకారణాల క్రమంగురించి విచారించలేని చేత

గానితనం—ఇవే మూఢవిశ్వాసాలు, అజ్ఞానమూ ఉండడానికి కారణాలు. రామమోహన్‌రాయ్ ఈ విషయాన్నే ఇలా పేర్కొన్నాడు : "అలవాట్లూ, ఆచారాలూ తమమీద చూపే ప్రభావంద్వారా కార్యకారణ క్రమంగురించి విచారించకుండా వారు గుడ్డిగా నదులలో స్నానం చెయ్యడం, చెట్లకు మొక్కడం, సన్యసించడం, మతగురువుల ద్వారా చేసిన పాపాలకు నిష్కృతి కొనుక్కోవడం (ఆయా మతాలలోని విచిత్ర ధోరణులనుబట్టి) జీవితం మొత్తంమీద చేసిన పాపాలనుండి ముక్తి, పవిత్రత లభిస్తాయని నమ్ముతారు. తాము నమ్ముకున్న వస్తువుల ప్రభావంవల్లా, తమ గురువుల మహిమవల్లా తాము పవిత్రులమవుతున్నామని వారు భావిస్తారు. నిజానికి అవి తమ నమ్మకాలకూ, ఇష్టానిష్టాలకూ తగినట్టు ఉంటాయని వారికి తెలియదు. తమ నమ్మకాలు-వాటిని అంగీకరించనివారిమీద ఎటువంటి ప్రభావమూ చూపవనికూడా వారికి తెలియదు. ఈ ఊహావస్తువులకు అసలు ప్రభావం అంటూ ఏదన్నా ఉంటే అది ఒక ప్రత్యేక దేశం యొక్క నమ్మకానికీ, అలవాట్లకూ పరిమితం కాకుండా వివిధ మతాలను అనుసరించే వివిధ దేశాలకూ ఉమ్మడిగా ఉండి ఉండాలి. ప్రభావంయొక్క శక్తి దానికి సంబంధించిన వివిధ వ్యక్తుల అర్హతలనుపట్టి భేదిస్తూ ఉంటుంది. కాని అది దాన్ని విశ్వసించే ఒక నిర్ణీత వ్యక్తియొక్క విశ్వాసంమీద ఆధారపడి ఉండదు. ఎవరన్నా విషాన్ని మిఠాయి అనుకుని తింటే, అది దాని ప్రభావాన్ని చూపి ఆ వ్యక్తిని చంపుతుందని మీరు అనుకోలేరా ?"

అతీత శక్తులు, అద్భుతాలు మొదలైన వాటిమీది విశ్వాసాన్ని రామమోహనుడు తిరస్కరించాడు. ఆయన ఇలా వ్రాశాడు: "మామూలు మనుష్యులు భ్రమలకు గురై తమ తెలివికి అంతుబట్టని సంఘటననో, పనినో చూసినప్పుడు, ఆ పనికి ఇదమిత్థమైన కారణం అంటూ దేన్నీ గ్రహించలేకపోయినప్పుడు - వారు దాన్ని అతీతశక్తికి ముడిపెడతారు. లేకుంటే అద్భుతం అంటారు. ప్రపంచంలోని పదార్థాలన్నీ ఒకదానికొకటి కార్యకారణక్రమంలో సంబంధపడి ఉంటాయనడంలోనే ఆ రహస్యం

దాగి ఉంది. ఏ పదార్థం ఉనికైనా ఒక నిర్ణీతకారణంమీదా, పరిస్థితిమీదా ఆధారపడి ఉంటుంది. అలా కనిపించని కారణాలగురించి కూడా పరిగణిస్తే, ప్రకృతిలో ఏ పదార్థమన్నా ఉండాలంటే దాంతో విశ్వమంతా సంబంధించి ఉంటుందని మనకు తెలుస్తుంది. అనుభవం లేకపోవడంవల్లా, భ్రమల ప్రభావానికి గురికావడంవల్లా ఎవరికైనా ఒక పదార్థంయొక్క కారణం తెలియకపోవచ్చు. దాన్ని మంచి అవకాశంగా తీసుకుని మరొకరెవరన్నా అది తన అతీతశక్తిగా పేర్కొని ప్రజలను ఆకర్షిస్తారు.''

అతీత శక్తులగురించి కలిగే భ్రమలనుంచి రక్షించుకోవడానికి తార్కికమైన విచక్షణాజ్ఞానం (Inductive reasoning) అలవరచుకోవాలని రామమోహన్‌రాయ్ బోధించాడు. ''తెలివిగలవారికి అటువంటి అతీత క్రియలనుంచి రక్షించుకోవడానికి తార్కికమైన విచక్షణాజ్ఞానం తగిన రక్షగా ఉపయోగపడగలదు. ఈ విషయంగురించి మనం చెప్పగల అభిప్రాయం—కొన్ని సందర్భాలలో ఎంత నిశితంగా, సూక్ష్మంగా పరిశీలించినా కొన్ని అద్భుత పదార్థాలు ఏర్పడే కారణంగురించి కొందరికి తెలియకపోవచ్చుననడమే. అటువంటి సందర్భాలలో మనం మన జ్ఞానాన్ని ఆశ్రయించాలి. కారణాన్ని అర్థం చేసుకోలేకపోవడం మన అశక్తివల్ల అనుకోవడం పొసగుతుందా అని, ఆ కార్యాన్ని ప్రకృతిసూత్రాలకు విరుద్ధంగా అసంభవమైన దేనికో ముడిపెట్టడం సమంజసమైనదేనా అనీ-మనం మన జ్ఞానాన్ని ప్రశ్నించుకోవాలి.''

ఆయన ''ప్రాపంచిక వ్యవహారాలలో ప్రజలు ఒకదానికి మరొకదానితో ఉన్న సంబంధాన్ని గ్రహించక-వాటిలో ఒకటి కారణమనీ, రెండవది కార్యమనీ నమ్మరు. అయినా మతప్రభావంగానీ, విశ్వాసపు ప్రభావంగానీ అంటే ఏమాత్రమూ సంబంధంకానీ, క్రమంగానీ లేని రెండిటిని గురించి - ఒకటి కారణమనీ రెండవది కార్యమనీ చెప్పడానికి సంశయించరు. ఉదాహరణకు పీడ తొలగాలని 'దువా'లు, ప్రార్థనలు చేయడం, జబ్బు నయంకావాలని తాయెత్తులూ, రక్షలూ ధరించడం మొదలైనవాటిని తీసుకోవచ్చును'' అని, ఆ విపరీత ధోరణిని ఆయన పేర్కొన్నాడు.

రామమోహనుడు అద్భుతాలపట్ల ఆదరణచూపే అభిప్రాయా లనూ, వాదాలనూ సంపూర్ణంగా తిరస్కరించాడు. నియమాలను ఉల్లం ఘించడానికి దేవుడికికూడా శక్తిలేదని ఆయన పేర్కొన్నాడు: 'సృష్టి కర్తకుకూడా అసాధ్యమైన విషయాలను సృష్టించే అధికారం లేదన్నది అందరూ ఒప్పుకునే విషయమే. ఉదాహరణలుగా దేవుడితో సమాన సహకారం కలిగి ఉండడం, దేవుడు లేకపోవడం, పరస్పరం పొసగని రెండు విపరీత విషయాలు ఉనికి మొదలైనవి చెప్పుకోవచ్చును."

దేవుడి మార్గదర్శకత్వం ప్రవక్తలద్వారా వ్యక్తమౌతుందన్న సామాన్య విశ్వాసాన్నికూడా ఆయన ప్రతిఘటించాడు. హేతువాద ధోరణిలో ఆయన "ప్రకృతిలోని తక్కిన పదార్థాలలాగానే ప్రవక్తల అవతరణ, వ్యక్తీకరణకూడా దేవుడితో నిమిత్తంలేకుండా బహిరంగ కారణాలమీదే ఆధారపడతాయి. అంటే అది ఒక ఆవిష్కర్త, ఆవిష్క రణమీద ఆధారపడి ఉంటాయి" అని నిరూపించడానికి ప్రయత్నించాడు.

19 వ శతాబ్దపు తొలిరోజులలో రామమోహనుడు కలిగిఉన్న మతసంబంధమైన ప్రాథమిక అభిప్రాయాలు ఎలా ఉండేవో తెలియజేయ డానికి నేను 'తుహ్ఫత్-ఉల్-మువాహ్హిదీన్' నుంచి అభిప్రాయాలను విరివిగా మీద వివరించాను. అప్పటికే ఆయనకు ఏకేశ్వరోపాసనపై ఆధారపడిన విశ్వమతం గురించిన అభిప్రాయం కలిగింది.

అప్పట్లోనే రామమోహనుడు ఈస్ట్ ఇండియా కంపెనీవారి రెవిన్యూశాఖలో ఉద్యోగం సంపాదించాడు. భాగల్పూర్, రామ్‌గర్, తదితర ప్రదేశాలలో పనిచేశాక ఆయనకు 1809 లో రంగపూరుకు బదిలీ అయింది. రంగపూరు రెవిన్యూ అధికారి అయిన శ్రీ జాన్ డిగ్బీకి సహాయకుడుగా పనిచేయడానికి రామమోహన్ అక్కడికి వెళ్లాడు. ఆయన 1809 నుంచి 1814 దాకా రంగపూరులో నివసించాడు. తన తీరిక సమ యాలను తీవ్రంగా చదవడంలోనూ, చర్చించడంలోనూ గడిపేవాడు. ఆ కాలంలోనే ఆయనకు హరిహరానంద తీర్థస్వామి అనే గొప్ప తాంత్రిక పండితుడి పరిచయం లభించింది. ఆయన సహాయంతో రామమోహనుడు

తాంత్రిక సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివాడు. రంగపూరు అప్పట్లో అన్ని రకాలవారికీ కూడలిగా ఉండేది. ముస్లిములు, జైనులు వర్తకం చేసుకోవడానికి అక్కడికి వచ్చేవారు. రామమోహనుడు జైనులతో సంపర్కం కలిగించుకుని కల్పసూత్రాన్నీ, తదితర జైన మతగ్రంథాలనూ శ్రద్ధగా చదివాడు.

రంగపూరులో ఉన్నప్పుడు రామమోహనుడు ఇంగ్లండు, యూరపుల రాజకీయ పరిస్థితులగురించి ఆసక్తి చూపేవాడు. డిగ్బీ ఇంగ్లండు నుంచి తెప్పించే పత్రికలనూ, వార్తాపత్రికలనూ ఆయన ఆసక్తితో చదివేవాడు. అలా ఆయన తన 22 వ యేట నేర్చుకోవడానికి ప్రారంభించిన ఆంగ్లభాషతో పరిజ్ఞానాన్ని పెంపొందించుకున్నాడు. అలాగే యూరపుకు సంబంధించిన రాజకీయభావం గురించిన పరిజ్ఞానంకూడా పెంపొందించుకున్నాడు. డిగ్బీ ద్వారా రామమోహనుడు అప్పట్లో యూరపులో వ్యాప్తిలో ఉన్న రాజకీయమైన ఉదారభావంపట్ల ఆకర్షింపబడ్డాడని తెలుస్తున్నది.

## కలకత్తాలో కృషి

1814 లో డిగ్బీ భారతదేశంనుంచి వెళ్ళిపోయాడు. అదీ ఒక రకంగా మంచిదే అయింది. రామమోహన్ తాను అన్నేళ్ళుగా ఈస్ట్ ఇండియా కంపెనీలో చేస్తున్న ఉద్యోగం మానేసి కలకత్తాలో స్థిరపడ్డాడు. శతాబ్దాలతరబడి ఆచారాలు, మూఢవిశ్వాసాలు, అలవాట్లు మొదలైన వాటిలో కప్పబడిన భారతదేశపు గాఢమైన వాస్తవాలను వెలికితీసి, వాటిని ప్రపంచపు సజీవ ఆలోచనావిధానాలకూ, నూతన కాలానికీ తగినట్టు మలచాలన్న తన జీవిత కార్యక్రమాన్ని ప్రారంభించడానికి ఆయన అప్పటికి పూర్తిగా సంసిద్ధుడయ్యాడు.

రామమోహనుడు అనుసరించిన విధానం. ఆయన ప్రత్యేకతా

ముద్ర కలది. ఆయన శాస్త్రాల అధికారాన్ని వెనువెంటనే నిరసించలేదు. కాని మానవుడు - ఉన్నతస్థాయికి చెందిన వాస్తవాన్ని గ్రహించడానికి శాస్త్రాల సాక్ష్యంమీద మాత్రం ఆధారపడితే లాభంలేదనీ, తన వివేకం, హేతువాదాలపై ఆధారపడాలనీ ఆయన పేర్కొన్నాడు. ఇందులో ఆయన మీమాంసపద్ధతిని అనుసరించి సత్యాన్వేషణకు పూనుకున్నాడు. శాస్త్రం లోని సాక్ష్యాధారాన్ని తీసుకుని దాని సార్థకతను అనుమానించి, దాని అధికారాన్ని ప్రశ్నించేవాడు. అప్పుడు ఆ విషయాన్ని పునఃపరిశీలనకు గురిచేసి, ఒక నిర్ణయానికి వచ్చేవాడు.

1815 లో ప్రచురింపబడిన వేదాంతంయొక్క వంగభాషానువాదా నికి పీఠిక వ్రాస్తూ రామమోహనుడు ఇలా చెప్పాడు: "శాస్త్రాలు, జ్ఞానమూ నిర్ణయించిన మార్గాన్ని మనం అనుసరించాలి. అలా ఈ ప్రపంచంలోనూ, తర్వాతి ప్రపంచంలోనూ కూడా సంపూర్ణ సంతృప్తిని పొందాలి." కేనోపనిషత్తుయొక్క ఆంగ్లప్రచురణ పీఠికలో ఆయన సత్య నిర్ణయానికి శాస్త్రం, హేతువాదం, భగవంతుడి దయ అనే మూడు అంశాలు కావాలని పేర్కొన్నాడు. 'శాస్త్రాలకూ, హేతువాదానికీ మనం పూర్తిగా దాసులు కాకపోవడమే మంచి పద్ధతి అనుకుంటాను. కాని వాటి వెలుగుతో హేతువాదాన్నీ, శక్తినీ, నైతిక జ్ఞానాన్నీ వెలిగించు కోవాలి. ఆ తర్వాత మనం భగవంతుడి సాయంమీద ఆధారపడాలి" అంటాడు ఆయన.

తాను రచించిన వివిధ సిద్ధాంత గ్రంథాలలోనూ, శాస్త్రాలగురిం చిన రచనలలోనూ రామమోహనుడు వశిష్ఠుని ఈ బోధనను చాలాసార్లు పేర్కొన్నాడు: "హేతువాదానికి పొసగే విషయాన్ని ఒక పాపాయి చెప్పినా అంగీకరించాలి. బ్రహ్మ అంతటివాడైనా హేతువాదానికి పొస గని విషయం చెబితే దాన్ని తృణీకరించాలి."

పరతత్త్వాన్ని గ్రహించడానికి ఇంద్రియాలు, మనసు, బుద్ధి మార్గాలంటుంది ఉపనిషత్తు. బ్రహ్మతత్త్వం (భగవంతుడి గురించిన జ్ఞానం) అతీతమైనదనీ అందువల్ల అది తెలుసుకోడానికి అసాధ్యమైనదనీ

ఉపనిషత్తు ఎక్కడా చెప్పలేదు. దాన్ని శాస్త్రాల అధికారంద్వారా సంపాదించాలని కూడా ఉపనిషత్తు పేర్కొనలేదు. వేదాంతంకూడా పుట్టుక, జీవితం, మృత్యువు మొదలైన వాటి సాక్ష్యాన్నిబట్టి పరతత్త్వమే ఈ విశ్వంయొక్క మూలకారణమని నిరూపించింది. దీన్నిబట్టి మనసు, బుద్ధి, పరిశోధన కలగలిపి బ్రహ్మతత్త్వాన్ని గ్రహించే మార్గాన్ని సూచిస్తాయని స్పష్టమవుతుంది. రామమోహనుడు సత్యాన్వేషణకు, సత్యనిర్ణయానికీ ఈ హేతువాద విధానాన్ని అనుసరించాడు. కాని ఆయన ఎప్పుడూ శాస్త్రాల అధికారాన్ని నిరసించలేదు. కాగా శాస్త్రాల బోధనలను అంగీకరించేముందు వాటిని పరిశోధించి, అర్థంచేసుకోవాలని చెప్పాడు.

1815 లో రామమోహనుడు ఆత్మీయసభ అనే సభను నెలకొల్పాడు. దాని ద్వారా ఆయన స్త్రీలను అమ్మే 'కులినిజం' (Kulinism), కులవ్యవస్థ మొదలైనవాటికి వ్యతిరేకంగా ఉద్యమం జరపసాగాడు. హిందూ స్త్రీలకు వారి తండ్రుల, భర్తల ఆస్తిలో హక్కు ఉండాలంటూ ఆయన నిర్విరామంగా కృషి చేశాడు. ఈ ఆత్మీయ సభ 1819 లో మూతబడింది. బ్రిటిష్‌వారి పూర్వాచారపరాయణత్వాన్ని, వలసవిధానాన్ని సమర్థించే 'జాన్ బుల్', ఉదారవాదానికి వ్యతిరేకులైన సనాతన హిందువుల ప్రచురణ అయిన 'సమాచార్ చంద్రికా' అనే పత్రికలు చేతులుకలిపి కలిసి కట్టుగా రామమోహనుణ్ణి ఎదుర్కొనసాగాయి. సనాతన హిందువుల 'ధర్మసభ' కూడా ఆయనను తీవ్రంగా వ్యతిరేకించసాగింది.

రామమోహనుడు "నేను హిందూమతాన్ని ఎప్పుడూ వ్యతిరేకించలేదు. నేను మూఢవిశ్వాసాలనూ, స్వపక్ష దురాభిమానాన్ని మాత్రమే వ్యతిరేకించాను" అని చెప్పినా, సనాతన హిందువులుమాత్రం ఆయన రక్తం కళ్లచూడాలని ఆవేశంతో ఊగిపోయేవారు. ఆయన సతిని విషేధించాలని విసుగూ విరామమూ లేక కృషిచేస్తున్నప్పుడు ధర్మసభ ఆయనను తీవ్రంగా ఎదిరించింది. హొరేస్ హేమన్ విల్సన్ అనే గొప్ప ప్రాచ్య విద్వాంసుడు కూడా సతిని నిషేధించడం హిందూమత వ్యవహా

రాలలో జోక్యం కలిగించుకోవడమే అవుతుందని భావించడం - ఇక్కడ పేర్కొనదగిన విషయం. అది సమంజసంకాదని రామమోహనుడు ఋజువు చేశాడు. వితంతువులను సజీవంగా కాల్చడానికి పార్లమెంటు అనుమతిని కోరుతూ 'ధర్మసభ'కు చెందిన సనాతన హిందువులు ఒక అర్జీ రూపొందించి, ఆ అర్జీని పార్లమెంటుకు సమర్పించడానికి ఫ్రాన్సిస్ భాతీ అనే న్యాయవాదిని నియమించారు. భాతీ కలకత్తా సుప్రీమ్ కోర్టులో న్యాయవాది. ఆయన కలకత్తాలో ఉపన్యసిస్తూ ఇలా అన్నాడు: "నేను మీ తరఫున ఇప్పుడు ఇంగ్లండుకు వెడుతున్నాను. మీ కోరికలు నెరవేర్చడానికి శారీరకంగాగానీ, మానసికంగాగానీ, వాగ్రూపంలో వెలిబుచ్చడానికిగానీ ఎటువంటి శ్రమ అయినా పడతాను. నా ఉపేక్షవల్ల ఎటువంటి నష్టమూ కలగకుండా చూడడానికి ప్రయత్నిస్తాను." ఈ బ్రిటిష్ ఘనుడి ప్రయత్నాలన్నీ విఫలమై, రామమోహన్‌రాయ్ ధీరప్రయత్నాల ద్వారా సతి నిషేధింపబడింది.

1815 లో రామమోహనుడు 'వేదాంత సూత్రము'ను వంగభాషలోకి అనువదించాడు. 1816 లో 'వేదాంతసారము'ను వంగభాషలోకీ, వేదాంతాన్ని ఆంగ్లభాషలోకి అనువదించాడు. అదే సంవత్సరంలో ఆయన ఈశ, కేన ఉపనిషత్తులను వంగ, ఆంగ్లభాషలలోకీ, 1817 లో కఠ, మాండూక్య ఉపనిషత్తులను వంగభాషలోకీ అనువదించాడు. వేదాంతాన్నీ ఉపనిషత్తులనూ వంగ, ఆంగ్లభాషలలోకి అనువదించడానికి జరిగిన తొలి ప్రయత్నాలు అవే. 1823 లో రామమోహన్ ఒక సిద్ధాంత గ్రంథాన్ని రచించాడు. "హిందూస్త్రీల హక్కులపై దురాక్రమణ" (The Encrachment or thc Rights of the Hindu Females) అనే ఆ గ్రంథంలో ఆయన హిందూస్త్రీలు తమ తండ్రుల, భర్తల ఆస్తులలో హక్కు ఉండాలని కోరాడు. 1827 లో ఆయన మృత్యుంజయుడు వ్రాసిన 'వజ్రసూచి' అనే సంస్కృత గ్రంథాన్ని పరిష్కరించి, ప్రచురించాడు. ఆ గ్రంథం వర్ణవ్యవస్థకు వ్యతిరేకమైనది.

## క్రైస్తవ మతబోధకులతో విభేదాలు

1821 లో కలకత్తా యూనిటేరియన్ సంఘం నెలకొల్పబడింది. ఈ సంఘానికి రామమోహనుడు మార్గదర్శకుడుగా ఉండి. ఆర్థికసహాయం కూడా చేశాడు. దేశప్రజల పరిస్థితి అన్నివిధాలా మెరుగుపడాలన్నదే ఆ సంఘంవారి ఆశయం. ఆ సంఘ సూత్రావళిలోని ఆశయాలనూ, ధ్యేయాలనూ రామమోహనుడే రచించాడు. ఆ సూత్రావళి చిరస్మరణీయమైనది; సామాన్యప్రజల ఉద్ధరణ సమస్యకు సంబంధించిన దానివిధానం ఎంతో ఆధునికంగా కనిపిస్తుంది. గాఢమైన ఆత్మవాదియైన రామమోహన్ జీవితపు ఐహిక, ఆర్థిక విషయాలను విస్మరించకపోవడం గమనార్హం. ఆత్మవాదులైన చాలామంది ఐహిక, ఆర్థిక విషయాలను విస్మరించడం తరచుగా కనిపించేదే. రామమోహనుడు ఒక వ్యక్తి జీవితంలోని వివిధ విభాగాలలో అంతర్లీనమైన ఐక్యతను బాగా అర్థంచేసుకున్నాడు. అందువల్లే మానవుడి ముక్తి ముక్కల రూపంలోనూ చెక్కల రూపంలోనూ కాక సంపూర్ణంగా ఉండాలని గ్రహించాడు.

ఆ సంఘం ఆశయాలగురించీ, ధ్యేయాలగురించీ రామమోహనుడు ఈ విధంగా పేర్కొన్నాడు : ''కనుక, ఏవేవి విద్యవల్ల కలిగే లాభాలను వ్యాపింపజేస్తాయో; ఏవి-అజ్ఞానం, మూఢవిశ్వాసం, స్వపక్ష దురభిమానం, ఉన్మత్తతనూ నశింపజేస్తాయో; ఏవి బుద్ధిస్థాయిని పెంపొందిస్తాయో; ఏవి నైతిక సిద్ధాంతాలను పరిశుభ్రపరుస్తాయో; ఏవి విశ్వాత్మకమైన దాతృత్వాన్నీ, ప్రయోగాత్మకమైన దయనూ పెంపొందిస్తాయో అవన్నీ వీటి నిర్మాణ పరిధికి చెందినవిగా పరిగణింపబడతాయి. ఈ దేశంలోని అసంఖ్యాకులైన ప్రజల బాహ్యస్థితిని మెరుగుపరచడం, ఉపయోగపడే కళలను ప్రోత్సహించడం, ప్రజలలో ఎడతెగక పరిశ్రమించే అలవాట్లను పెంపొందించి తద్వారా వారి సాంఘిక, కుటుంబ సౌఖ్యాలను పెంపొందించడం-

ఇవే తన ప్రధాన ధ్యేయాలని ఈ బృందం భావిస్తున్నది. ప్రకృతి, సంఘం అనే రెండిటి ప్రాథమిక అవసరాలు పూర్తిగా తీరితేతప్ప బుద్ధి, సౌశీల్యం, మతం మొదలైన వాటిలో ఉన్నతస్థాయికి చెందిన అభివృద్ధి సాధ్యంకాదని అనుభవం నిరూపించింది."

ఆ రోజుల్లో బెంగాలులోని సెరాంపూరు - క్రైస్తవ మతబోధకులకు ప్రశస్తమైన కేంద్రంగా ఉండేది. అక్కడికి మతబోధకులుగా వచ్చిన మొదటి బృందాలలో గొప్ప పండితులుగానూ, భక్తులుగానూ పేరు గడించిన ప్రముఖులు ఉన్నారు. వారిలో కొందరికి-రెవరెండ్ విలియం కేరీ వంటివారికి-బెంగాలు ఋణపడి ఉంది. అయితే వారు ప్రజలను తమ మతంలోకి మార్చడానికి ప్రయత్నించడంవల్ల ఆ మతబోధకులకు మత భేదాలు రేకెత్తించేవారన్న ముద్రపడింది. అదీకాక వారు హిందూమతానికి వ్యతిరేకంగా ప్రచారం చేసేటప్పుడు పక్షపాత ధోరణీ, హిందూమతం గురించిన జ్ఞానం లేకపోవడమూ వ్యక్తమయ్యేవి. రామమోహనుడు 'బ్రహ్మన్ సెబధి' అనే వంగభాషా పత్రికను, 'బ్రహ్మానికల్ మాగజైన్' అనే ఆంగ్లపత్రికను ప్రచురించసాగాడు. వాటిలో ఆయన హిందూ ఏకేశ్వరోపాసనా విధానాన్ని వేదాంతాన్నీ సమర్థిస్తూ సెరాంపూరు మత బోధకుల వ్యతిరేకతను ప్రతిఘటించసాగాడు.

క్రైస్తవుల త్రికసిద్ధాంతాన్ని (Trinitarianism)రామమోహన్ ఘాటుగా విమర్శించేవాడు.రామమోహనుడు. ఒకపక్క తన స్నేహితుడైన రెవరండ్ ఆడంతోనూ; మరోపక్క రెవరండ్ డాక్టర్ రైలండ్, లెఫ్టినంట్ లైట్ మొదలైనవారితోనూ త్రికసిద్ధాంతంగురించి వాదించ సాగాడు. వాద ప్రతివాదాలు పెద్దయెత్తున చెలరేగాయి త్రికసిద్ధాంతాన్ని సమర్థిస్తూ ఒక క్రైస్తవ మతబోధకుడు చేసిన గణితవాదాలను 'ఆసియాటిక్ జర్నల్'లో రామమోహనుడు ఖండించాడు. "కొన్నాళ్ల క్రితం త్రికాన్ని బలపరిచే ఒక దివ్యమైన గణితవాదాన్ని చూశాను. అది ఇలా ఉంది: మూడు రేఖలు ఒక త్రిభుజాన్ని రూపొందించేలా ముగ్గురు వ్యక్తులు ఒక దైవాన్ని రూపొందిస్తారు. త్రికం ఉనికి గురించి సర్ ఐజాక్

న్యూటన్ వంటి గణితశాస్త్ర కోవిదుల బుద్ధికి గోచరించని అనుకూలమైన వాదాన్ని త్రికసిద్ధాంత ప్రియులు వెలుగులోకి తీసుకురావడం ఆశ్చర్యకరంగా ఉంది. ఈ సిద్ధాంతం నిజమై ఉంటే న్యూటన్ ఎందుకు చెప్ప లేదా అనే అనుమానం కలుగుతుంది. దైవత్వాన్నీ, త్రిభుజాన్నీ పోల్చడమే మొదట దేవుడి అసలు ఉనికికి భంగం కలిగిస్తున్నది. ఒక స్థితిని గాని సాపేక్ష స్థితినిగాని పురస్కరించుకుని అన్నిరకాల అన్వయాలూ చేయడం ఊహలలో సాధ్యమేకానీ సత్యంకాదు.

"ఇక రెండవ అంశం. ఈ పోలిక తండ్రి, కుమారుడు, పవిత్రాత్మలమధ్య వారు నెలకొల్పదలుచుకునే ఐక్యతను భంగం చేస్తున్నది. ఒక త్రిభుజంయొక్క మూడు భుజాలూ ప్రత్యేకస్థితిని గలవిగా భావించడమే ఇందుకు కారణం.

"మూడవదిగా - ఈ దేవతా విభాగాలు మూడిటికీ 'దేవుడు' అనే విశేషణం అన్వయించదు. త్రిభుజంలోని విడి భుజాలను మనం త్రిభుజంగా పేర్కొనముకదా?

"నాలుగవ అంశం. హిందువులలో భగవంతుణ్ణి నాలుగు వ్యక్తుల కలయికగా 'చతుర్ భూతాత్మకం'గా పరిగణించే ఒక తెగవారున్నారు. వారు ఈ పోలికను ఉపయోగించుకుని తమ సంయుక్త దైవాన్ని ఒక చతుర్భుజంయొక్క నాలుగు భుజాలకూ అన్వయించవచ్చును.

"ఐదవ అంశం. ఈ తరహా వాదం - దైవత్వం పేరిట అనేక దేవతామూర్తులను విశ్వసించే అధిక సంఖ్యాకులైన హిందువులు అనేక దేవతారాధనను సమర్థించుకోవడానికే బాగా ఉపయోగపడగలదని అనుకోవచ్చును."

రామమోహనుడు మతబోధకులతో ఈ చర్చలను 1820 నుంచీ 1823 దాకా కొనసాగించాడు. 1820 లో ఆయన 'ఏసు బోధనలు-శాంతికీ, సంతోషానికీ మార్గదర్శి' (The Precepts of Jesus, the Guide to Peace and Happiness) అనే చిన్న పుస్తకం ప్రచురించాడు. అందులో ఆయన కొత్త నిబంధన (New Testament) గ్రంథంలోని

సిద్ధాంతభాగాన్నీ, హేయబద్ధంకాని అభిప్రాయాలనూ, రహస్య ఘటన లనూ, అద్భుతాలనూ వ్యతిరేకించాడు. రెవరండ్ డియోకర్ ష్మిట్ (Revarend Deocar Schmidt, అనే క్రైస్తవ మతబోధకుడు రామ మోహన్‌ను 'విగ్రహారాధకుడు' అనీ, 'సత్య కార్యకలాపాలకు కీడుచేసే వాడు' అనీ నిందించాడు. రామమోహనుడు - రెవరెండ్ ష్మిట్‌కు సమా ధానంచెప్పే తీరులో 'క్రీస్తు బోధనలు' గ్రంథాన్ని సమర్థిస్తూ 'క్రైస్తవ ప్రజలకు ఒక విన్నపం' (An Appeal to the Christian Public) ప్రచురించాడు. 'ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా'లో డాక్టర్ జాషువా మార్ష్ మన్ ఇందుకు వ్యతిరేకంగా వ్రాశాడు. రామమోహన్ 'క్రైస్తవ ప్రజ లకు రెండవ విన్నపం' (Second Appeal to the Christian Public) లో దానికి సమాధానమిచ్చాడు. అది 1821 లో ప్రచురింప బడింది. డాక్టర్ మార్ష్‌మన్ మళ్ళీ 'ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా'లో రామ మోహనుడి రచనను వ్యతిరేకించాడు. 1823 జనవరిలో రామమోహనుడి 'క్రైస్తవ ప్రజలకు తుది విన్నపం' (Final Appeal to the Christian Public) వెలువడింది. 'ఏసు బోధనలు' పుస్తకం పీఠికలో రామ మోహన్ ఇలా వ్రాశాడు: "కొత్త నిబంధన గ్రంథంలో కనిపించే నీతి బోధనలను అందులోని తక్కిన విషయాలనుంచి విడదీస్తే, అవి వివిధ మతాలకూ, విభిన్న జ్ఞానస్థితులకూ చెందిన వ్యక్తుల మనసులనూ, బుద్ధు లనూ అభివృద్ధిపరచి తగిన ఫలితాన్ని తీసుకురాగలవు. చారిత్రకభాగాలూ, తక్కిన కొన్ని భాగాలూ - స్వేచ్ఛగా ఆలోచించేవారికోనూ, క్రైస్తవేత రులలోనూ సందేహాలనూ, సంఘర్షణలనూ కలిగించగలవు. ముఖ్యంగా అద్భుత సంబంధాల గురించినవి - ఆసియాలోని ప్రజలలో తరతరాలుగా సాగివచ్చే కట్టుకథలలోని అద్భుతాలకన్నా తీసికట్టుగా ఉన్నాయి. అందు వల్ల వాటికి అంతగా విలువ ఉండదు. నైతిక సిద్ధాంతాలు ఇందుకు వ్యతి రేకంగా ఉన్నాయి. అవి మానవజాతి శాంతి సమైక్యతలను రక్షించగలవి; చదువుకున్నవారికీ చదువుకోనివారికీ కూడా సులభంగా అర్థం కాగలవు. మత, నైతికసంబంధమైన ఈ సామాన్యవిధానం - మానవుడి ధ్యేయాలను

భగవంతుడి గురించిన ఉన్నతమైన, ఉదారమైన అభిప్రాయాలకు లేవ నెత్తడానికి అనుగుణంగా గణింపబడింది. మనుష్యులు-తమకూ, సంఘా నికీ తాము చేయవలసిన కర్తవ్యాలను నెరవేర్చడానికి తగ్గట్టు ప్రవర్తించ డానికి ఈ విధానం పనికివస్తుంది. అందువల్ల దాన్ని ఈ రూపంలో ప్రచు రించడంవల్ల గొప్ప ఫలితాలు ఏర్పడగలవని నా విశ్వాసం.

సెరాంపూరు మతబోధకుల పత్రికలు వేదాంతాన్నీ, హిందూ ఏకే శ్వరవిధానాన్నీ విమర్శిస్తూనే ఉన్నాయి. అందువల్ల రామమోహనుడు ఆ విమర్శలను ప్రతిఘటిస్తూ 1823 నవంబరులో 'బ్రహ్మానికల్ మాగ జైన్' నాలుగవ సంచికలో వ్రాయవలసివచ్చింది.

ఆ సంచిక పీఠికలో ఆయన ఇలా వ్రాశాడు: "ఈ పత్రిక మూడవ సంచికలో నేను మతసంబంధమైన చర్చలలో బాధాకరమైన మాటలు ఉప యోగించకూడదని వినయపూర్వకంగా మనవి చేశాను. అయినా మత బోధకుల పత్రికలనుండి వెలువడి, మతబోధకులు పంచిపెట్టిన ఒక చిన్న ప్రచురణలో వేదాలలోని సిద్ధాంతాలను 'నాస్తిక' వాదాలుగా నిరసించడం, వాటిని అనుసరిస్తున్న మా గురించి అనవసరమైన విసుర్లు విసరడం నాకు ఆశ్చర్యాన్నీ, బాధనూ కలిగిస్తున్నాయి. ఇదే దాదాపు రెండేళ్ళ వ్యవధి తర్వాత 'బ్రహ్మానికల్ మాగజైన్' నాలుగవ సంచికను ప్రచురించడానికి నన్ను పురికొల్పింది.

"దేన్నయినా సహించగల సరళమైన, ఉదారమైన భావం హిందూ మతంయొక్క ప్రాథమిక సిద్ధాంతం. దానికి అనుగుణంగా నేను ఏ మతవిధా నాన్నీ, అందులోనూ క్రైస్తవమతాన్ని ఎదుర్కోవడానికి సిద్ధంగాలేను. అదీ గాక ఆ బోధకుల అభిప్రాయాలపట్ల నాకున్న గౌరవం ఆ మతంలోని తప్పుల గురించి నన్ను విమర్శించనీయడంలేదు. క్రైస్తవ రచయితలు ఇప్పటి కింకా హిందూ మతంగురించి అవివేకంగా వ్రాసి, తమ తప్పులను నా దృష్టికి తెస్తున్నారు. మన ఈ రెండు మతాల తులనాత్మక పరిశీలనకు పూనుకుని నిశితపరిశీలన చేస్తే బాగుండునని నాకు ఇప్పటికింకా అనిపిస్తూనే ఉంది. అయితే క్రైస్త్రవ రచయితలు ఈ చర్చను సాహిత్యశీలానికీ,

సత్యమైన సత్యాన్వేషకులకు అనువైన నాగరకమైన భాషలో కొనసాగిస్తే ఈ తులనాత్మక పరిశీలన మరింత బాగుంటుందని నా భావం.''

త్రికసిద్ధాంతానికి వ్యతిరేకంగా రామమోహనుడు చేసిన వాదాలకు తగిన సమాధానం చెప్పలేక డా॥ మార్ష్‌మన్ హిందూమతాన్ని అసహ్యమైన ధోరణిలో విమర్శించాడు. ఆయన హిందూమతం 'అబద్ధాలకు తండ్రి' అయిన వ్యక్తినుంచి పుట్టిందన్నాడు. రామమోహనుడు అందుకు జవాబిస్తూ ''మనం మతసంబంధమైన చర్చలో నిమగ్నులమై ఉన్నామని మరువకూడదు. మనం పరస్పరం తిట్టుకోవడంవల్ల ప్రయోజనంలేదు'' అని వ్రాశాడు. క్రైస్తవ మతబోధకులకూ, రామమోహనుడికీ మధ్య సాగిన చర్చలగురించి అభిప్రాయం వెల్లడిస్తూ 'ఇండియా గెజిట్' పత్రికా సంపాదకుడు రామమోహనుడి గురించి ఇలా వ్రాశాడు: ''అది అతని బుద్ధికుశలతనూ, తార్కిక పరిజ్ఞానాన్నీ, వాదించడంలో ఆయన చూపే సాటిలేని ప్రశాంతస్వభావాన్నీ మరింతగా వెల్లడిచేసింది.

మతసంబంధమైన చర్చలన్నిటిలోనూ రామమోహనుడు ఉన్నత స్థాయికిచెందిన ఈ ధోరణినే అనుసరించాడు. ఆయన వినయగుణంతో కూడిన గాంభీర్యం కలిగిఉండేవాడు. అందులో మార్పు ఉండేదికాదు. దానిమూలంగా ఆయన తన వ్యతిరేకులపట్ల నిష్కపటంగానూ, నిష్పక్షపాతంగానూ వ్యవహరించేవాడు. తన వ్యతిరేకులు తనను దూషించినా రామమోహనుడు-చర్చల సందర్భంలో ఎప్పుడూ కోపం తెచ్చుకోలేదు. క్రైస్తవ మతబోధకులతోనూ. సనాతన హిందువులతోనూ ఏళ్ళతరబడి ఆయన సాగించిన పోరాటాలలో ఈ విషయం స్పష్టమవుతుంది. ఆయన వ్రాసిన ప్రతి పదం, ఆయన మాట్లాడిన ప్రతి మాట- హేతువాదాన్నీ, విశ్వజనీనతను, ధర్మనిష్ఠనూ వెల్లడిచేసేవి.

రామమోహనుడి మరొక గుణం ఆయన న్యాయధోరణి. ఒకసారి ఆయన క్రైస్తవ మతబోధకులతో చర్చిస్తున్నప్పుడు బైబిలు మూలం చదవకుండా క్రైస్తవ మతాన్ని ఆయన చర్చించడం సబబా అనే ప్రశ్న వచ్చింది. రామమోహనుడు ఆ విమర్శలోని సత్యాన్ని అంగీకరించాడు.

ఆయన లాటిన్, హీబ్రూ భాషను నేర్చుకోసాగాడు. అప్పట్లో రెండేళ్ల పాటు ఆయన మతబోధకులతో ఎటువంటి చర్చకూ పూనుకోలేదు. ఆ విషయం ఆయన మాటలలోనే వెల్లడి అవుతున్నది: "ఇదే దాదాపు రెండేళ్ళ వ్యవధితర్వాత 'బ్రహ్మానికల్ మాగజైన్' నాలుగవ సంచికను ప్రచురించడానికి నన్ను పురికొల్పింది." రామమోహనుడు ప్రారంభించిన పునరుజ్జీవనంచేత ప్రభావితుడైన రాఖాల్‌దాస్ హల్దార్ 1852 జూలై 19 నాటి తన 'ఇండియన్ డైరీ'లో ఇలా వ్రాశాడు: "ఇవాళ నేనొక యూదుడితో సంభాషించాను. బైబిలు మూలాన్ని చదవడానికి హీబ్రూ నేర్చుకోవాలన్న మహాపురుషుడు రామమోహన్‌రాయ్‌కి హీబ్రూ నేర్పింది తన మేనమామే అని ఆయన చెప్పాడు." బ్రహ్మానికల్ మాగజైన్ నాలుగవ సంచికలో రామమోహనుడు శివప్రసాద్ శర్మ అనే కలం పేరు మీద 1823 నవంబరు 15 నాడు ఒక వ్యాసం వ్రాశాడు. దాని పేరు క్రైస్తవ మతాన్ని నిరసించడానికి ఒక హిందువు చెప్పే కారణాలు (Reasons of a Hindu for rajecting the Doctrines of Christianity). దాంట్లో ఆయన త్రికానికీ, క్రీస్తు పాపపరిహారాన్ని అనుగ్రహించడానికీ సంబంధించిన సమస్యలను చర్చించాడు. ఈ రెండు క్రైస్తవమతంలో భాగాలుగా పరిగణింపబడేవి. ఈ రెండు సిద్ధాంతాలూ పొసగనివని ఆయన తనకు సహజమైన తార్కిక పరిశీలన, హేతువాదం, ధర్మనిష్ఠ మొదలైనవాటి ద్వారా నిరూపించాడు.

క్రైస్తవ మతబోధకుల విమర్శలకు వ్యతిరేకంగా వేదాంత బోధనలను సమర్థించడానికి - త్రికాన్నీ, క్రీస్తు పాపపరిహారం అనుగ్రహించడాన్నీ నిరసించడానికి రామమోహనుడు 'ఏసు బోధనలు-శాంతికీ సంతోషానికీ మార్గదర్శి' అనే పుస్తకం పీఠికలో ఇలా వ్రాశాడు: "ఈ కారణాలవల్ల నేను ఈ విషయాలగురించి చర్చలో పాల్గొనడానికి ఇష్టపడడంలేదు. నా దృష్టిని క్రీస్తు మాటలను ఆంగ్లంనుంచి సంస్కృతంలోకీ, వంగభాషలోకీ అనువదించడంలో నిమగ్నంచేసి నా సాటి ప్రజల ముందు పెడుతున్నాను."

క్రైస్తవ మతబోధకులతో రామమోహనుడు జరిపిన వాదోప వాదాలు అనుకోనితీరులో ఫలించింది. బాప్టిస్టు మతబోధకుడైన రెవరెండ్ విలియం ఆడమ్ త్రికసిద్ధాంతానికి విరుద్ధమైన రామమోహనుడి ఏకేశ్వర విధానం సమంజసమైనదని పూర్తిగా అంగీకరించాడు. ఆయన త్రికసిద్ధాంతాన్ని నిరసిస్తూ, ఏకేశ్వర క్రైస్తవ మతాన్ని బహిరంగంగా ప్రోత్సహించసాగాడు. ఇది కలకత్తాలోని యూరపియనులకు ఆందోళన కలిగించింది. వారు ఆడమ్‌ను 'పతనంపొందిన రెండవ ఆదమ్' అని పేర్కొన్నారు. ఈ విషయం ఆందోళనకరంగా పరిణమించి, కలకత్తా బిషప్- అన్యమతాన్ని అవలంబిస్తున్నాడన్న నేరంకింద ఆడమ్‌ను భారతదేశం నుంచి బహిష్కరించడానికి ప్రయత్నించాడు. సనాతన క్రైస్తవమతాన్ని ఉల్లంఘించినవారి గురించి విచారణ జరపడం, వారిని సంస్కరణకు గురి చేయడంవంటివి అమలుజరిపే పాతరోజులు గడచిపోయాయని ఇంగ్లండులోని అటార్నీ జనరల్ కలకత్తా బిషప్పుకు వ్రాశాడు.

ఏసుక్రీస్తు బోధనలను ఉద్ధరించి బోధించడానికీ, క్రైస్తవమతంలోని హేతుబద్ధంకాని వేదాంత సిద్ధాంతాలనూ నిరసించడానికీ-సెరంపూరు మతబోధకులు ప్రచురించే 'ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' 20 వ సంచికలో ఒక వ్యాసం వెలువడింది. ఆ వ్యాసకర్త 'ఒక క్రైస్తవ మతబోధకుడు'. ఆ వ్యాసం రామమోహనుణ్ణి క్రైస్తవులకు తగని విషపూరితమైన తీరులో నిందించింది. కోపాన్నీ ద్వేషాన్ని వెలిగక్కిన ఈ అసహ్యమైన రచనకు 1820 లో రామమోహనుడు 'ఏసు బోధనలపక్షాన క్రైస్తవ ప్రజలకు ఒక విన్నపం' (An Appeal to the Christian public in defence of The Preccpta of Jesu) అనే కరపత్రం ప్రచురించాడు. ఈ కరపత్రం రామమోహనుడి తార్కికబుద్ధికీ, పరిశీలనా విచక్షణకూ, హితమిత ధోరణికీ చక్కని ఉదాహరణ.

"ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా 20 వ సంచికలో 'ఒక క్రైస్తవ మతబోధకుడు' అనే పేర ఒక పెద్దమనిషి ఆ మధ్య వెలువడిన 'ఏసు బోధనలు' గురించి వ్రాసిన కొన్ని సూచనలు చదివి నేను ఎంతగా ఆశ్చర్య

పడ్డానో అంతగా నిరుత్సాహపడ్డాను. ఈ విషయమై ఆ పత్రికా సంపాదకుడు కూడా అదే ధోరణిలో వ్రాసిన వ్రాతలుకూడా చదివాను. విమర్శకు గురి అయిన పుస్తకం గురించినవారి ఆక్షేపణలను పరిశీలించేముందు ఆ ఆక్షేపణలలో కనిపించిన క్రైస్తవ సహజంకాని విధానంగురించీ, మర్యాదను అతిక్రమించే తీరుగురించి ప్రజలకు వినయపూర్వకంగా విన్నపం చేస్తున్నాను. అలా ఆ పత్రికా సంపాదకుడు ఆ కూర్పుగురించీ, కూర్పరి గురించీ వ్యక్తిగతస్థాయిలో దూషణకు పూనుకోవడమూ, కూర్పరిని 'క్రైస్తవేతరుడైన హీనుడు' అని నిందించడమూ సమంజసంగా లేవు. 'క్రైస్తవ సహజంకాని ధోరణి' అని నేను పేర్కొనడం ఆ సంపాదకుడు 'క్రైస్తవేతరుడైన హీనుడు' అనే మాటను ఉపయోగించినందువల్లనే. అది క్రైస్తవ మతానికి అవసరమైన సత్యాన్ని, ధర్మనిష్ఠనూ, ఔదార్యాన్ని అతిక్రమించిందని నా భావం. కొత్త నిబంధన గ్రంథంలోని నైతిక సిద్ధాంతాలను 'శాంతికీ, సంతోషానికీ మార్గదర్శి' అనే పేరిటా, మత నైతికనిష్ఠను 'ఏసు బోధనలు' పేరిటా వెలువరించిన వ్యక్తిని; భగవంతుడే ఈ సృష్టికి కర్త, రక్షకుడు అని నమ్మే వ్యక్తిని; ఈ బోధనలు మానవజాతినంతటికీ తమ కర్తవ్య నిర్వహణలో ఆచరణయోగ్యమైనవని విశ్వసించే వ్యక్తిని - ఈ విమర్శకుడు, సంపాదకుడు 'క్రైస్తవేతరుడైన హీనుడు' అనడం ఎంతవరకు సమంజసం?" అని వ్రాశాడు రామమోహనుడు.

ఇంతకూ క్రైస్తవ మతబోధకుల కంట రామమోహనుడు చేసిన 'పాపం'గా కనిపించింది ఒకటే. అది - కొత్త నిబంధనగ్రంథంలో కనిపించే హేతుబద్ధంకాని విశ్వాసాలనుంచి క్రీస్తుచేసిన నైతిక బోధనలను వేరుచేయడం. అందుకు మరో కారణం - రామమోహనుడు క్రీస్తు బోధనలు మానవజాతికి విశ్వజనీనమైన సందేశాన్ని యిచ్చేవిగా భావించి, క్రైస్తవ మతవ్యవస్థలోని హేతుబద్ధంకాని విశ్వాసాలూ విధానాలూ క్రీస్తు బోధనలను అంగీకరించడానికి ఆటంకాలని భావించడం. ఈ ప్రయత్నం చేసినందుకు మతబోధకులు రామమోహనుణ్ణి 'సత్యాన్వేషణకు కీడుచేసేవాడు' అని పేర్కొన్నారు

"భగవంతుడు-మతం మనిషికీ మనిషికీ మధ్యఉన్న విభేదాలను మాపేదిగానూ, అప్రియాన్ని తొలగించేదిగానూ, మానవజాతి శాంతి సమైక్యతలకు దోహదం చేసేదిగానూ ఉండేలా చేయగలడుగాక!" అనే చిరస్మరణీయమైన మాటలతో రామమోహనుడు తన విన్నపాన్ని పూర్తి చేశాడు. పాపపరిహారాన్ని అనుగ్రహించడం, త్రికసిద్ధాంతం మొదలైన వాటిగురించి రామమోహనుడు చేసిన విమర్శనాత్మక పరిశీలన-క్రైస్తవ వేదాంతంలో ఆయినకుగల చక్కని పాండిత్యాన్ని సూచిస్తుంది. ఆ పాండిత్యం సాయంతో ఆయన వేదాంతానికి, హిందూ మతానికీ వ్యతిరేకంగా సంకుచిత ధోరణిలో తలపడిన క్రైస్తవ మతబోధకులను ఎదుర్కొన్నాడు.

భారతదేశంలోని క్రైస్తవ మతబోధకులు రామమోహనుణ్ణి భీకరంగా ఎదుర్కొన్నా, యూరపులోనూ అమెరికాలోనూ ఆయన రచనలను ఆదరించేవారు. 1816 లో వేదాంతం గురించిన ఆయన ఆంగ్లప్రచురణ వెలువడింది. ఇంగ్లండునుంచీ, యూరపుఖండంలోని తక్కిన దేశాలనుంచీ వెలువడే పత్రికలు ఆ రచనను ప్రశంసించాయి. 'ది మంత్లీ రిపాజిటరీ ఆఫ్ తియాలజీ అండ్ జనరల్ లిటిరేటర్' (The Monthly Repository of Theology and general Literature) వేదాంతం గురించిన రామమోహనుడి సిద్ధాంతగ్రంథాన్ని కూలంకషంగా విమర్శిస్తూ ఇలా పేర్కొన్నది: "రామమోహన్‌రాయ్ అనే హిందూ బ్రాహ్మణుడు ఈ ఏడాది కలకత్తాలో 'వేదాంతం మొదలైనవాటి సంగ్రహం' అనే చిన్న పుస్తకం ప్రచురించాడు. అందులో వేదాలలోని ప్రశస్తభాగాలన్నీ కూర్చబడ్డాయి. ప్రకృతిసిద్ధమైన మతసిద్ధాంతాలు అందులో గౌరవంగా వెలువరింపబడ్డాయి. అది చిల్లరదేవుళ్ళను పూజించడాన్ని, కర్మకాండనూ, ఉత్సవకాలాలను అనుసరించడాన్నీ, ఆహార విభేదాలను పాటించడాన్నీ అసంపూర్ణ మతంయొక్క సాధనాలుగా పరిగణించింది. భగవంతుడి గురించిన జ్ఞానాన్నీ, ప్రేమనూ కలవారూ దానిలాగానే వీటిని పరిగణించరు."

బ్లాయిస్ బిషప్ అయిన ఏబ్బేగ్రెగాయిర్ ఫ్రెంచి భాషలో రచిం

చిన కరపత్రంలో రామమోహనుడి గురించి యిలా పేర్కొన్నాడు: "ఆరునెలల కొకసారి ఆయన తన ఆస్తికవాదాన్ని వివరిస్తూ వంగభాష లోనో, ఆంగ్లంలోనో ఒక చిన్న గ్రంథం ప్రచురిస్తాడు. ఆయనకు వాదోప వాదాల్లో పాల్గొనడమంటే యిష్టం. వేదాంతంలోనూ, జ్ఞానంలోనూకూడా తాను సమర్థుడే అయినా ఆయన సాధారణ అభిప్రాయాల ద్వారా కాక తార్కికమైన విచక్షణద్వారా తన అభిప్రాయాలు వెల్లడిస్తాడు. అలాగే హిందువుల పాండిత్య ప్రకర్షతోకూడిన వేదాంతానికి సాటి రాగలవి యూరోపియను గ్రంథాలలో లేవని ఆయన నొక్కిచెబుతాడు."

లండన్‌కు చెందిన డాక్టర్ టి. రాస్‌కు 1824 జూన్ 4 న కలకత్తా నుంచి రామమోహనుడు వ్రాసిన ఉత్తరంలో ఇలా ఉంది: "గౌరవనీయు లైన ఆర్యా, నా చిరునామాకు పంపిన గత జూన్ 16 వ తేదీనాటి మీ ఉత్తరమూ, పుస్తకాల పార్సల్ నాకు ఎంతో సంతృప్తి కలిగించాయి. 'ఏసు బోధనలు' అనే రచననూ, దాన్ని సమర్థిస్తూ వ్రాసిన మరి రెండు రచనలనూ, పునర్ముద్రించడం ద్వారా బృందంవారు నాకు కల్పించిన గౌరవం-నాకు గర్వకారణం. మీ బృందసభ్యులకు వారి మెచ్చుకోలుకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు అందజేయవలసిందిగా ప్రార్థిస్తు న్నాను. క్రీస్తు బోధించిన నిర్మలమైన, సాధారణమైన, ప్రయోగాత్మక మైన మతాన్ని దానికి రోమనుల పరిపాలనాకాలంలో క్రమక్రమంగా చేర్పబడిన అజ్ఞానంతోకూడిన సిద్ధాంతాలనుంచీ, అసంబద్ధమైన అభిప్రా యాలనుంచీ వేరుచేయాలన్న ఊహతో యూరపులోనూ, అమెరికాలోనూ సత్యమిత్రులు ఇందరు కృషిచేస్తున్నారనడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. నా సంతోషాన్ని వ్యక్తపరచడానికి మాటలు చాలవు. ఈ మహనీయుల ప్రయత్నాలు లూతర్, తదితరులు మొదలైనవారి విజయ మంతా ఘనంగా (అంతకన్నా ఎక్కువకాకున్నా) ఉండాలని నేను మన సారా ప్రార్థిస్తున్నాను. మతసంబంధమైన సంస్కరణచేయడానికి మొదట పునాది వేసినందుకూ; దివ్యాధికారానికీ మానవ క్రియలకూ మధ్యగల భేదాన్నీ, నిరర్థకమైన బాహ్యకార్యకలాపాలకూ ధార్మిక కార్యకలాపాలకూ

మధ్యగల భేదాన్ని కనుగొనే విధానాన్ని కనుగొన్నందుకూ వారికి మత ప్రపంచం కృతజ్ఞతకలిగి ఉంటుంది."

క్రైస్తవ మతంగురించీ, వేదాంతంగురించీ రామమోహనుడు వ్రాసిన సిద్ధాంత గ్రంధాలకు అమెరికాలో ప్రోత్సాహం లభించింది. తోరో (Thoreau), సర్వోత్కృష్ట తత్త్వవేత్తలు (Transcendentalists) వాటిని చదివి ప్రభావితులయ్యారు. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో 'రాయ్ దృక్పథం' పెంపొందసాగింది. మాన్‌క్యూర్ డేనియల్ కాన్వే 1894 లో 'ఓపన్ కోర్ట్' సంచికలో ఇలా వ్రాశాడు: "అసలు రామమోహనుడే బ్రిటిష్, విదేశ ఏకేశ్వరోపాసక సంఘాల వ్యవస్థకు కారకుడు. ఈ హిందూ ఆచార్యుడి అనుయాయులు వివిధ ప్రదేశాలలో ఆస్తిక సంఘాలను నెల కొల్పారు. వాటిలో మద్రాసుకుచెందిన సంఘంవారు శ్రీ ఫాక్స్‌తో సంప్ర తించారు. 1820 సెప్టంబరులో పార్లమెంట్ కోర్ట్ మద్రాసు ఏకోశ్వరో పాసకులకు ఐదు గినీలను పంపింది; కలకత్తాలో ఆంగ్లో ఇండియన్ యూనిటేరియన్ చాపెల్ (Anglo Indian unitarian chapel) నిర్మాణానికి ఇరవై పౌండ్లు విరాళమిచ్చింది. ఈ వాస్తవాలూ, రామ మోహన్‌రాయ్ అనువదించిన మతసంబంధమైన కవిత్వమూ, శ్రీ ఫాక్స్‌ను ఏకేశ్వరోపాసనకన్నా విశాలమైన ఐక్యతను కనుగొనడానికి అనువుగా మేల్కొల్పాయి. మతసంబంధమైన తత్త్వవేత్త అయిన ఈ హిందువుకు సాటివచ్చేవారు క్రైస్తవ సంఘంలో ఎవరూలేరు. ఆయనతోనే ప్రాచ్య ఆలోచనావిధానం పాశ్చాత్య ఆలోచనావిధానాన్ని ఎదుర్కొంది. అది సఫలమైనది. 1831 మే 25 వ తెదీనాడు సంఘం-సౌత్ ప్లేస్ చాపెల్‌లో తన ఆరవ వార్షికోత్సవాన్ని జరుపుకుంది. సరిగా ఆ సమయానికి రామ మోహన్‌రాయ్ వచ్చాడు. ఫ్రాన్స్‌నుంచీ, ట్రాన్సిల్వేనియానుంచీ ఏకేశ్వరోపాసకులు అక్కడికి వచ్చారు; హార్వర్డ్ విశ్వవిద్యాలయా ధ్యక్షుడు డాక్టర్ కిర్‌క్‌లాండ్ కూడా అక్కడ ఉన్నారు. రామమోహన్ రాయ్ సంగ్రహంగా ఉపన్యసించాడు. అయినా ఆ ఉపన్యాసం ప్రబోధాత్మ కంగా ఉండి అక్కడ ఉన్నవారందరినీ ఆయన వ్యక్తిత్వపు ఆకర్షణ ఉత్సాహంతో నింపి వేసింది."

రామమోహనుడు హిందువుల మతవిధానాలలో కనిపించిన హేతుబద్ధంకాని విశ్వాసాలనూ, కర్మకాండనూ కూడా వ్యతిరేకించాడన్న విషయం ఇక్కడ గుర్తుంచుకోవాలి. క్రైస్తవ మతబోధకుల విమర్శలకు గురికాకుండా హిందూ వేదాంతాన్నీ, మతాన్నీ సమర్థించడంకోసం ఆయన వాటిలోని హేతుబద్ధంకాని విశ్వాసాలనూ, కర్మకాండనూ ఎప్పుడూ సమర్థించలేదు. సత్యాన్వేషకుడికి ఉండరాని ఈ పక్షపాతం - మతసమస్యల గురించి చర్చించే మత పక్షపాతులలో తరచుగా కనిపిస్తుంది. రామమోహనుడిలో ఈ పక్షపాత ధోరణి ఎప్పుడూ కనిపించలేదు. ఆయన తన సహజ గంభీరధోరణిలో హిందూమతంలోని ఉత్తమాభిప్రాయాలను మలినంచేస్తున్న హేతుబద్ధంకాని విశ్వాసాలనూ, కర్మకాండనూ స్థిరంగా నిరసించాడు; అయితే వాటిని ఎన్నడూ పక్షపాత ధోరణిలో ఆదరించలేదు.

రామమోహనుడు విశ్వమత అన్వేషకుడు. హిందూమతం, ఇస్లాం, బౌద్ధమతం, క్రైస్తవమతం మొదలైన నాలుగు మతాలనూ తులనాత్మకంగా పరిశీలించి, వాటి ప్రాథమిక సూత్రాలలోని ఐక్యతను కనుగొన్న మొట్టమొదటి వ్యక్తి-రామమోహనుడే. ఆయన ప్రపంచ మతాలను సంఘటితంచేసే దృష్టితోగాక, సమన్వయంచేసే దృష్టితో పరిశీలించాడు. ప్రొఫెసర్ మోనియర్ విలియమ్స్ అభిప్రాయం ప్రకారం-మతాల తులనాత్మక పరిశీలనకు రామమోహనుడే మార్గదర్శి. మాక్స్‌ముల్లర్ రామమోహనుణ్ణి ప్రాచ్య పాశ్చాత్యాలమధ్య సమన్వయం కుదిర్చినవారిలో మొదటివాడని పేర్కొన్నాడు. ఈ మతాలమధ్య విశ్వజనీనమైన ఐక్యతను కలిగించడానికి సంస్కరణ అవసరమని రామమోహనుడు భావించాడు. రామమోహన్‌రాయ్ ఆలోచనలోనూ, కార్యక్రమాలలోనూ ఈ విషయంగురించి విశేష పరిశీలన జరిపిన డాక్టర్ బ్రజేంద్రనాథసీల్-రామమోహనుడు "దీర్ఘదర్శి, ఆధునిక భారతదేశానికి వాస్తవంగానే తండ్రివంటి వాడు" కాగలడో నిరూపించాడు.

ఈ సందర్భంలో కలకత్తాలో రామమోహనుడి స్నేహితుడు, సహచరుడు అయిన రెవరెండ్ విలియం ఆడం చేసిన ప్రశంసను ఇక్కడ

పేర్కొవడం సమంజసంగా ఉంటుంది: "ఆయన స్వతంత్రంగా ఉంటాడు; లేకుంటే స్వాతంత్ర్యం లేకుండానే ఉంటాడు. స్వతంత్ర వాతావరణంలో ఆయన ఉండాలనుకున్నాడు. అందుకు తగిన పరిస్థితి లేదనిపించినప్పుడు, తనకు కావలసిన పరిస్థితిని స్వయంగా రూపొందించుకున్నాడు. ప్రాచీన ఆంగ్ల కవిలాగా ఆయన 'నా మనసే నా సామ్రాజ్యం' అనుకున్నాడు. తన స్వతంత్ర సామ్రాజ్యంలోనుంచి ఆయన మత, సామాజిక, రాజకీయ పీడన వ్యవస్థలను ఎదుర్కొన్నాడు. పరిస్థితుల ప్రభావంవల్ల ఆయన ఆ వ్యవస్థలలో భాగం వహించి - నటుడుగానో, బాధపడేవాడుగానో, బోధకుడుగానో, మోసపోయినవాడుగానో ఉండవలసివచ్చింది. తనకు విచిత్రమైనవీ, ద్వేషభావాన్ని ప్రోత్సహించేవీ, కీడు కలిగించేవీ అయిన అధికారాలూ, హక్కులూ ఉన్నా, ఆయన వాటిని తనకు కలగజేసిన మత, సాంఘిక నియంతృత్వాన్ని ప్రతిఘటించడం ఆయన గొప్పతనానికి గుర్తు అనవచ్చు. ఆయన ఆత్మకు చాలా ప్రీతిపాత్రమైనది-స్వాతంత్ర్యంమీది ప్రేమ. ఆ స్వాతంత్ర్యం శరీర స్వాతంత్రంకాక బుద్ధికి సంబంధించింది; అది ఆచరణకు సంబంధించిందికాక, ఆలోచనకు సంబంధించినది. ఆయన-తన దేశప్రజల మతమూ; తన దేశం, కుటుంబం, వంశం, తన వ్యక్తిగత స్థాయి మొదలైనవి విధించిన ఆచార వ్యవహారాలను చీల్చుకుంటూ, అవి వేసిన బంధాలను తెంచుకుంటూ, ఆ బంధాలను కాలరాస్తూ ముందంజ వేశాడు. తనదారికి అడ్డువచ్చినవాటిని ఆయన నిర్భయంగా తొలగించుకున్నాడు. తన బుద్ధి స్వాతంత్ర్యంపట్ల ఎవరన్నా పరోక్షంగా వ్యతిరేకత చూపినా, ఆయన గాఢంగా గాయపడి, అవమానం పొందినట్టు భావించి-ఆ వ్యతిరేకతను ఎదుర్కొనేవాడు. ఆయనలో వ్యక్తిగత స్వాతంత్ర్యం పట్లగల విశ్వాసమూ, తన బుద్ధిస్వాతంత్ర్యం ఏమాత్రం భంగంచెందుతుందనిపించినప్పుడు కలిగే సున్నితమైన ఈర్ష్య ఉండేవి. వాటితోబాటు మతం విషయంగానో, రాజకీయంగానో తనకు పూర్తిగా వ్యతిరేకులైనవారికి గల సమానమైన హక్కులగురించిన చక్కని అవగాహనకూడా ఉండేది. అంతేకాదు. ప్రకృతి నియమాలవల్లా, సాంఘిక విధానాలవల్లా తన అధికారా

నికి లోబడి ఉండేవారికిగల సమానమైన హక్కులనుకూడా ఆయన గౌర వించేవాడు. ఈ స్వాతంత్ర్య ప్రియత్వం-ఆయన ప్రత్యేక లక్షణం. అది సక్రమమైన, స్వనియమితమైన స్వాతంత్ర్యం వ్యక్తికీ, సంఘానికీ ప్రసా దించగల మహాసంకల్పాలలో ఆయనకుగల నమ్మకంలోంచి పుట్టిన హేతు బద్ధమైన విశ్వాసం. ఆయన తన స్వాతంత్ర్యానుభవాన్ని ఒక తరగతికి గాని, ఒక రంగుకుగాని, ఒక జాతికిగాని, ఒక దేశానికిగాని, ఒక మతా నికిగాని పరిమితం చేసుకోలేదు. ఆయన సానుభూతి మానవజాతికంతటికీ వ్యాప్తమైనది.

## విద్యాసంస్కరణ

భారతదేశంలో అప్పట్లో ఉన్న విద్యావిధానాన్ని సమూలంగా సంస్కరించకపోతే కొన్ని శతాబ్దాలుగా గాఢనిద్రలో ఉన్న దేశాన్ని మేల్కొల్పడం సాధ్యంకాదని రామమోహనుడు గ్రహించాడు. సంపూర్ణ మైన మార్పు కలిగించకపోతే విద్యావిధానం నిరుపయోగమవుతుందన్న పరిస్థితి అది. ప్రపంచదేశాల మధ్య భారతదేశం తనకు అర్హమైన స్థానాన్ని మళ్లీ సంపాదించడానికి హేతుబద్ధమూ, వైజ్ఞానికమూ అయిన విద్యావిధానం అవసరమైంది. కంపెనీ ప్రభుత్వం - హిందూ పండితుల పర్యవేక్షణలో సంస్కృత పాఠశాల నెలకొల్పి, అప్పటికి భారతదేశంలో వ్యాప్తిలో ఉన్న ప్రాచీన విద్యను బోధించాలని నిర్ణయించినప్పుడు రామ మోహనుడు ఆ నిర్ణయాన్ని ప్రతిఘటించాడు. ఆయన-జీవశాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయనశాస్త్రం, గణితశాస్త్రం మొదలైనవి నేర్పాలన్నాడు. 1823 డిసెంబర్ 11 న ఆయన అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ ఆమ్ హెర్స్ట్‌కు ఒక ఉత్తరం వ్రాస్తూ అందులో ఇలా పేర్కొన్నాడు: "ప్రభుత్వంవారు హిందూ పండితుల పర్యవేక్షణకింద ఒక సంస్కృత పాఠశాల నెలకొల్పి ఇదివరలో భారతదేశంలో వ్యాప్తిలోఉన్న ప్రాచీన విద్యను బోధించే ఏర్పాటు చేస్తున్నారు. ఈ పాఠశాల (లార్డ్ బేకన్

కాలానికి ముందు యూరపులో ఉన్న పాఠశాలలలా) పసివారి బుద్ధికి వ్యాకరణ విశేషాలతోనూ, తత్త్వవిచారాలతోనూ నింపడానికి మాత్రమే ఉపయోగపడగలదనవచ్చును. వాటివల్ల సంఘానికి కొద్దిపాటి ఉపయోగం ఉంటే ఉండవచ్చును; లేకుంటే ఏ ఉపయోగమూ లేకపోవచ్చును. ఈ పాఠశాలలో చదివే పిల్లలు ఇప్పటికీ భారతదేశంలోని అన్ని భాగాలలోనూ ఉన్న పిల్లల్లా - రెండువేల యేళ్ల ముందునాటి చదువే నేర్చుకుంటారు; దాంతోబాటు ఆ తర్వాతి పండితులు రూపొందించిన వ్యర్థవిషయాలూ, శూన్యమైన చమత్కారాలూ నేర్చుకుంటారు. బ్రిటన్ దేశాన్ని సత్యమైన జ్ఞానానికి దూరంగా అజ్ఞానంలోనే ఉంచదలుచుకుని ఉంటే బేకన్ తత్త్వాన్ని అనుమతించక, అంతకుముందు బళ్ళలోని బండచదువునే ప్రోత్సహించి ఉండేవారు. అలాగే సంస్కృత విద్యావిధానాన్ని అనుసరించడమే బ్రిటిష్ ప్రభుత్వంవారి విధానమైతే, ఈ దేశాన్ని చీకట్లో ఉంచడానికి అదే చాలు. బ్రిటిష్ పాలనకు లోబడిఉన్న స్థానికప్రజల అభివృద్ధి ప్రభుత్వ కర్తవ్యమైతే - అది విజ్ఞాన వికాసానికి దోహదంచేసే విద్యావిధానాన్ని ప్రోత్సహిస్తుంది. ఆ విద్యావిధానంలో గణితశాస్త్రం, ప్రకృతి తత్త్వశాస్త్రం, రసాయనశాస్త్రం, శరీర తత్త్వశాస్త్రం, ఉపయోగకరమైన తక్కిన శాస్త్రాలూ నేర్పాలి. అలా నేర్పడానికి ఇప్పుడు కేటాయించిన మొత్తంతోనే-యూరపులో చదువుకున్న విద్యావంతులు కొందరిని నియమించి, కావలసిన పుస్తకాలూ, పరికరాలూ, తక్కిన సామగ్రీ అన్నీ అమరి ఉండే కళాశాలను నెలకొల్పవచ్చును.''

బిషప్ హెబెర్ ఈ ఉత్తరాన్ని లార్డ్ ఆమ్‌హెర్స్ట్ చేతుల్లో పెట్టాడు. అప్పట్లో విద్యావిషయాలకు సంబంధించిన జనరల్ కమిటీ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్‌కు అధ్యక్షుడైన జె. హెచ్. హారిసన్ ఈ ఉత్తరం 'సమాధానం ఇవ్వడానికి అర్హమైంది కాదు' అని వ్రాశాడు. 1882 లో లార్డ్ రిప్పన్ నియమించిన విద్యాసంఘం ''ఆయన (రామమోహనుడు) పేర్కొన్న విధానాన్ని విద్యాసంఘం ఏకగ్రీవంగా అంగీకరించడానికి 12 ఏళ్ల వాదోపవాదాలు, మెకాలే పట్టుదల, కొత్త గవర్నర్ జనరల్ స్థిరమైన

చర్య - అవసరమయ్యాయి" అని పేర్కొన్నది. వైజ్ఞానిక విద్య కావా లంటూ రామమోహనుడు చేసిన ప్రబోధానికి సనాతన విద్యను ఆదరించే వాళ్లు పెడఅర్థాలు తీశారు; తప్పుడు అన్వయాలు చేశారు: దాన్ని తీవ్రంగా విమర్శించారు. రామమోహనుడు - మన విద్యావిధానంనుంచి సంస్కృతాన్ని కూకటివేళ్ళతోబాటు పెకలించాలనుకుంటున్నాడనీ, సంస్కృతాన్ని వ్యతిరేకిస్తున్నాడనీ నింద వ్యాపించసాగింది సంస్కృత సాహిత్యాన్ని అధ్యయనం చేయడంకోసమూ, హిందూ ఏకేశ్వరోపాసనను సమర్థించడం కోసమూ 1825 లో వేదాంత కళాశాలను స్థాపించిన వ్యక్తిమీద ఇటువంటి ఘోరమైన అపనిందవేశారు। 1826 జూలై 27 వ తేదీనాటి లేఖలో విలియం ఆడమ్ ఇలా వ్రాశాడు: "ఇటీవల రామమోహనుడు చిన్నదే అయినా చక్కగా ఉన్న ఒక కళాశాలను పెంపొందించాడు. దాన్ని ఆయన వేదాంత కళాశాల అని పిలుస్తున్నాడు. అక్కడ ఒక గొప్ప పండితుడి ద్వారా కొందరు యువకులకు హిందూ ఏకేశ్వరోపాసనను సమర్థించే తీరులో సంస్కృత సాహిత్యాన్ని బోధిస్తున్నాడు; దాని వ్యాప్తికి కృషి చేస్తున్నాడు. దీనితోబాటు అక్కడ యూరోపియన్ విజ్ఞాన శాస్త్రాన్ని, క్రైస్తవ ఏకేశ్వరోపాసనా విధానాన్నికూడా బోధించాలనుకున్నాడు. అయితే ఆ బోధన వంగభాషలోనో, సంస్కృతంలోనో సాగాలంటాడు ఆయన."

భారతదేశంలో వైజ్ఞానిక విద్యను ప్రవేశపెట్టాలని రామమోహనుడు కోరుకున్నాడు. విజ్ఞానశాస్త్రం చదవడంవల్ల-ప్రజలు మూఢవిశ్వాసాలనూ, అజ్ఞానాన్నీ విడనాడి వికాసం పొందగలరని ఆయన ఆశించాడు. యూరపుదేశాలలో వైజ్ఞానిక విద్యావిధానం-చర్చి అధీనంలో ఉన్న విద్యావిధానాన్ని తొలగించినట్లే భారతదేశంలోనూ జరగగలదని ఆయన భావించాడు. 1816 లో హిందూ కళాశాల స్థాపించినప్పుడు ఆయన డేవిడ్ హేర్‌తోనూ, తక్కిన వారితోనూ చేతులు కలిపాడు. సనాతన హిందువులు హిందూ కళాశాలస్థాపనలో పాల్గొనడాన్ని వ్యతిరేకించడంతో, ఆయన అందులోంచి ఎవరి ప్రమేయమూ లేకుండానే తప్పుకున్నాడు. అయితే హిందూ కళాశాల నెలకొల్పాలన్న పథకాన్ని ప్రోత్సహించిన ప్రముఖు

లలో రామమోహనుడు ఒకడన్న విషయంమాత్రం నిస్సందేహంగా—సత్యం.

1816 మే నెల 14 వ తేదీనాడు సుప్రీంకోర్ట్ ప్రధాన న్యాయమూర్తి అయిన సర్ హైడ్ ఈస్ట్ ఇంట్లో హిందూ కళాశాలను నెలకొల్పడం గురించి ఒక సమావేశం జరిగింది. నాలుగురోజుల తర్వాత సర్ హైడ్ ఈస్ట్ ఇంగ్లండులో జడ్జిగా ఉన్న జె. హారింగ్టన్ అనే ఆయనకు ఒక ఉత్తరం వ్రాశాడు: "ఇటీవల ఇక్కడ ఆసక్తికరమూ, విచిత్రమూ ఆయిన పరిస్థితి ఒకటి రూపొందుతున్నది. కాలంతోబాటు అన్ని విషయాలూ మార్పుకు గురికాక తప్పదని అది నిరూపిస్తున్నది. మే నెల ప్రారంభంలో కలకత్తాకు చెందిన ఒకే బ్రాహ్మణుడు (రామమోహన్ రాయ్) నన్ను చూడడానికి మా యింటికి వచ్చాడు. ఆయన నాకు పరిచితుడు. మేధావి. ఇక్కడి స్థానిక ప్రముఖులమధ్య ఆయన పలుకుబడి కలవాడు. మన ప్రముఖులలో చాలామందికి ఆయన సన్నిహితుడు. ఆయన నాతో మాట్లాడుతూ - చాలామంది హిందూ ప్రముఖులు యూరోపియన్ ప్రముఖులు అనుసరిస్తున్న విధానంలో తమ పిల్లలకు విద్యాభ్యాసం జరిపించడానికి తగిన సంస్థను నెలకొల్పితే బాగుంటుందని అనుకుంటున్నారని చెప్పాడు. నా పర్యవేక్షణలో ఒక సమావేశం జరిపి, వాళ్ళ ప్రయత్నానికి సహాయం చెయ్యమన్నాడు. ఆయన వెళ్ళిపోయాక నేను గవర్నర్ జనరల్‌కు జరిగిన విషయాలగురించి తెలియజేశాను. ఆయన నా సందేశాన్ని సుప్రీమ్ కౌన్సిల్ ముందుంచగా, ఆ సభ్యులందరూ నేను అనుసరించిన విధానాన్ని ఆమోదించారు. మా యింట్లో ఆ హిందూ ప్రముఖులు సమావేశం కావడానికి ఎటువంటి ఆక్షేపణలేదని సుప్రీమ్ కౌన్సిల్‌వారు గవర్నర్ జనరల్ ద్వారా నాకు తెలియజేశారు. అందుకు అనుగుణంగా 1816 మే నెల 14 న మా యింట్లో సమావేశం ఏర్పాటయింది. హిందూ ప్రముఖులు, సంపన్నులు, ప్రముఖ పండితులు మొదలైనవారు యాభైమంది సమావేశానికి వచ్చారు. అప్పుడు దాదాపు యాభై వేలరూపాయల విరాళాలు ప్రకటింపబడ్డాయి. మరిన్ని విరాళాలు చెయ్యగలమని చాలా

మంది హామీ యిచ్చారు. ఆ రోజు కార్యక్రమాన్ని ప్రారంభించడానికి ముందు నేను వచ్చిన ప్రముఖులలో చాలామందితో సంభాషించాను. ముఖ్యంగా బాగా పలుకుబడి ఉన్న ఒక సంపన్న బ్రాహ్మణుడితో మాట్లాడు తున్నప్పుడు రామమోహన్‌రాయ్ పట్ల ఆయనకుగల విరోధభావాన్ని గుర్తించాను. అందుకు కారణాలు - రామమోహన్‌రాయ్ హిందువుల విగ్రహారాధనకు వ్యతిరేకంగా రచనలు చేయడం, స్థానికప్రజలను తీవ్రంగా విమర్శించడం.''

ఈ వాక్యాలనుబట్టి హిందూ కళాశాల పథకాన్ని రూపొందించిన ప్రముఖులలో రామమోహనుడు కూడా ఒకడన్న విషయం స్పష్టమవు తుంది; తాను ఆ సంఘంలో ఉంటే తన ఉనికివల్ల ఆ పథకానికి ముప్పు వస్తుందన్న ఉద్దేశంతో ఆయన అందులోంచి తప్పుకున్నాడని కూడా తెలుస్తుంది.

1822 లో రామమోహనుడు ఏకేశ్వరోపాసకుల సంఘం తరపున హై ఇంగ్లీషు స్కూలును ప్రారంభించాడు. ఆ బడి ఖర్చులన్నిటినీ ఆయనే భరించేవాడు. ఆ బడి నిర్వహణలో డేవిడ్ హేర్, రెవరండ్ ఆడమ్‌కూడా పాల్గొనేవారు. మహర్షి దేవేంద్రనాథ ఠాగూరు ఈ బడిలో చదువుకున్నారు. తక్కిన బడులలో విజ్ఞానశాస్త్రాన్ని ఆంగ్లంలో బోధి స్తుంటే, ఈ బడిలోమాత్రం విజ్ఞానశాస్త్రాన్ని వంగభాషలో బోధించేవారు. 1821 డిసెంబరులో రామమోహనుడు 'సంబద్ కౌముది' అనే వంగ వారపత్రికను ప్రచురించడానికి పూనుకున్నాడు ఈ వారపత్రిక సంచిక లలో ఒకదాంట్లో ఆయన బీదవారైన హిందువుల పిల్లలకు ఉచితంగా చదువు నేర్పడానికి అనువుగా ఒక బడి స్థాపించాలని ప్రభుత్వంవారికి విజ్ఞప్తి చేశాడు. 1821-24 సంవత్సరాల మధ్య ఆయన తన పత్రికలో వైజ్ఞానిక విషయాలగురించిన వ్యాసాలెన్నో ప్రచురించాడు. వాటిలో 'ధ్వని శాస్త్రంలో ప్రతిధ్వని' (Echo in Acoustics), 'అయస్కాంతంయొక్క గుణాలు' (Properties of the Magnet), 'చేపల ప్రవర్తన '(Behaviour of Fishes), 'బెలూన్ వర్ణన' (diseription of a Balloon)

వంటివికూడా ఉండేవి. రామమోహనుడు వంగభాషలో వ్యాకరణం, భూగోళశాస్త్రం, ఖగోళశాస్త్రం, జ్యామితి మొదలైన విషయాలకు సంబంధించిన వాచకాలు వ్రాశాడు.

గణితశాస్త్రం, జీవశాస్త్రం, రసాయనశాస్త్రం మొదలైనవాటిని బోధించాలని రామమోహనుడు చేసిన ఉద్బోధ ఆయన మరణించిన తర్వాత ఎప్పుడో ఫలించింది. భారతదేశంలో విజ్ఞాన విద్యాబోధన జరగాలని ఉద్యమం ప్రారంభించినవాడు రామమోహనుడే అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## వంగభాషా వచన రచనకు 'పిత'

పందొమ్మిదవ శతాబ్దపు తొలిరోజులలో వంగభాషలోని వచన రచనలో సంస్కృతపదాలే ఎక్కువగా ఉండేవి. దానికొక రూపమంటూ లేదు. అప్పట్లో వంగ వచన శైలి - వీలైనన్ని సంస్కృత పదాలను వాడడంకోసం పోటీపడే పండితుల దయమీద ఆధారపడిఉండేది. పందొమ్మిదవ శతాబ్దపు తొలిరోజులనాటి ఆ సంస్కృతమయమైన వంగవచన శైలి స్వరూప స్వభావాలలో వంగభాషా లక్షణాలు లేవనే చెప్పాలి.

వంగ వచనాన్ని మొదట్లో ప్రోత్సహించినవారు - సెరంపూరుకు చెందిన క్రైస్తవ మతబోధకులు, ఫోర్ట్ విలియమ్ కళాశాలా పండితులు. క్రైస్తవ మతబోధకులు స్థానిక హిందువులమధ్య క్రైస్తవ మతాన్ని వ్యాపింపజేయడంకోసం వంగవచన శైలిలో ఆసక్తి చూపించారు ప్రభుత్వ నిర్వహణలోని ఫోర్ట్ విలియం కళాశాల వంగవచనాన్ని పరిపాలనావసరాలకోసం ఉపయోగించాలనుకున్నది. అప్పట్లో యువకులైన బ్రిటిష్ అధికారులకు వంగభాషను నేర్పేవారు. భాష తెలిసిఉంటే వారు స్థానిక ప్రజలతో ప్రత్యక్షసంబంధం కలిగి ఉండవచ్చనే ఉద్దేశంతో ఇలా స్థానిక భాషలు నేర్పేవారు.

1778 లో హాల్‌హెడ్ ఆంగ్లంలో రచించిన 'వంగభాషా వ్యాకరణం' ప్రచురింపబడింది. ఆ పుస్తకం అట్టమీద ఆ వ్యాకరణం 'ఫరంగి' వారికి ఉపయోగపడడంకోసం (ఫిరింగీణామ్ ఉపకారార్థ) వ్రాయబడిందని పేర్కొన్నారు. ఆ తర్వాతి ప్రయత్నం చేసినవాడు-సెరాంపూరు మతానికి చెందిన డాక్టర్ విలియం కేరీ అనే ఆదర్శప్రాయుడైన మతబోధకుడు. కేరీ వ్రాసిన వంగభాషా వ్యాకరణం 1801 లో వెలువడింది. ఇది కూడా కొత్తగా ఉద్యోగంలోచేరే ఆంగ్లేయాధికారులు స్థానికభాష నేర్చుకోవాలన్న ఉద్దేశంతో వ్రాయబడిందే.

కాని, రామమోహన్‌రాయ్ - మొట్టమొదట వంగభాషలో వంగ ప్రజలకోసం వంగభాషా వ్యాకరణం వ్రాసే ప్రయత్నానికి పూనుకున్నాడు. ఇంగ్లండుకు వెళ్ళేముందు రామమోహనుడు 'వంగభాషా వ్యాకరణం' ఒకటి (గాడీయ వ్యాకరణ్) వ్రాశాడు. దాన్ని 1833 లో కలకత్తా పాఠ్య గ్రంథసంస్థ ప్రకటించింది. అందులో 68 వివిధ విషయాలగురించిన 11 అధ్యాయాలు ఉన్నాయి. వాటిలో వ్యాకరణంయొక్క అవసరం, ఆవశ్యకతలగురించీ, ఛందస్సుగురించీ ఆయన చర్చించాడు.

1801 లో తొలి వంగ వచనగ్రంథం వెలువడింది. అది విదేశీయుల ఉపయోగంకోసం రామ్‌రామ్ బసు అనే ఆయన వ్రాసిన వాచకం. 1802 లో పండిత మృత్యుంజయ్ విద్యాలంకార్ 'బత్రిస్ సింహాసన్' వెలువడింది. అది రామ్‌రామ్ బసు వ్రాసిన 'ప్రతాపాదిత్య చరిత్ర'కన్న మెరుగ్గా ఉంది. అదీకాక, విద్యాలంకారుడి పుస్తకం సంస్కృత పదాలతో నిండిన వాచకం. ఆ కాలంలో వంగ వచన రచన వాచక పుస్తకాల రచనకే పరిమితమై ఉండేది.

వంగ సాహిత్యరంగంలో రామమోహనుడు ప్రవేశించగానే వంగ వచన రచనలో విప్లవాత్మకమైన మార్పు కనిపించసాగింది. 1815 లో 'వేదాంత గ్రంథం' వెలువడింది. అది రామమోహనుడి తొలి వచన రచన. అప్పటిదాకా ఉన్న వంగ వచన రచనలనుంచి పూర్తిగా భిన్నంగా ఉంది అది. అది వాచకం కాదు; వంగ వచనంలో వ్రాసిన మూలగ్రంథం. అదీ

గాక అందులో అర్థంకాని సంస్కృతపదాల పులుముడు లేదు. అది అక్షరాలా వంగ వచన రచన. ఆ గ్రంథం పీఠికలో రామమోహనుడు తాను వ్రాసిన వచనాన్ని ఎలా చదవాలో పాఠకులకు వివరిస్తూ, వచనంలో ఒక వాక్యాన్ని నిర్మించడానికి పాటించవలసిన నియమాలను పేర్కొన్నాడు.

ఈ పీఠిక రామమోహనుడి స్పష్టమైన ఆలోచనావిధానానికీ, మౌలికతకూ - చక్కని ఉదాహరణ. వంగ వచన రచన బంకించంద్ర చటర్జీ, రవీంద్రనాథ ఠాగూరుల ఆధ్వర్యంలో సాహిత్యరూపంగా సాధించిన ఘనత - వంగ వచన రచనకు రామమోహన్‌రాయ్ రూపొందించిన పునాదులమీద ఆధారపడినదే.

# వంగభాషలో 'ద్రుపద్' గీతాలు

సంగీతరంగంలో కూడా రామమోహన్‌రాయ్ సేవ ప్రత్యేకమైనదే. పందొమ్మిదవ శతాబ్దంలోని తొలి రెండు దశాబ్దాలలో ప్రచారంలో ఉన్న పాటలు - టుమ్రీ, టప్పా, కీర్తన, రామప్రసాదీ తరహాలకు చెందినవి. వాటితోబాటు బౌల్, సారి, జారి, తక్కిన రకాల జానపద గేయాలు ప్రచారంలో ఉండేవి. ఆ కాలంలో వంగభాషలో 'ద్రుపద్' పాటలు లేవు. అప్పటికి వినవచ్చే 'ద్రుపద్' పాటలన్నీ హిందీభాషలో ఉండేవి. వంగభాషలో మొదటి ద్రుపద్‌గీతం వ్రాసినవాడు రామమోహనుడే. ఆ రచన 1828 లో జరిగింది. గాఢంగా ఉన్నా సాధారణంగా ఉండి అనవసరమైన సంగీతాడంబరాలు లేకుండా ఉండే ఈ గీతాలను తన బ్రహ్మసభా సమావేశాలలో ప్రవేశపెటవలసిన అవసరం ఉందనుకున్నాడు. ఆ సందర్భాలకు టప్పా, టుమ్రీలవంటివి తేలికగా ఉండి, తగవని అనుకున్నాడు ఆయన. ఆయన తన బ్రహ్మసభా సమావేశాలకు పాడడంకోసం వంగభాషలో 32 ద్రుపద్‌గీతాలు రచించాడు. ఆయన తర్వాత బ్రహ్మసమాజం దాన్ని స్వీకరించి మహర్షి దేవేంద్రనాథ ఠాగూరు మార్గదర్శకత్వంలో వంగభాషలోని ద్రుపద్ గీతాలను సుసంపన్నం చేశారు.

# రాజకీయ సంస్కరణపట్ల ఆసక్తి

స్వదేశంలోని మత, సాంఘిక వ్యవస్థలలో తాను తీసుకురాదలుచుకున్న మార్పులు భారతదేశంలోని రాజకీయ పురోభివృద్ధిమీద లాభకరమైన ప్రభావం చూపగలవనడంలో ఆయనకు ఎంతమాత్రమూ సందేహం లేదు. 1828 లో ఆయన "ప్రస్తుతం హిందువులు అనుసరిస్తున్న మత విధానం వారి రాజకీయ వ్యవహారాలను మెరుగుపరచుకోవడానికి వీలు కలిగించడంలేదని నేను విచారిస్తున్నాను. కులాల భేదాలు, ఒక్కొక్క కులంలోనూ బోలెడన్ని విభాగాలూ ఉండడం హిందువులకు బొత్తిగా రాజకీయభావమే లేకుండాచేసింది. లెక్కలేనన్ని మత కర్మకాండలూ, ప్రాయశ్చిత్తసూత్రమూ హిందువులను కష్టమైన కార్యక్రమం దేన్ని స్వీకరించడానికి అనర్హులను చేశాయి అందువల్ల వాళ్ళ రాజకీయాభివృద్ధి, సాంఘిక చైతన్యాలకోసమైనా వాళ్ల మతంలో కొన్ని మార్పులు రావడం అవసరమనుకుంటాను." అన్నాడు. అలా రామమోహనుడు మతసంస్కరణకూ రాజకీయ, సాంఘిక పురోభివృద్ధికీ మధ్యగల సంబంధాన్ని పూర్తిగా గుర్తించాడు.

1821-22 ప్రాంతాలలో రామమోహనుడు వంగభాషలో 'సంబద్ కౌముది', పారశీకభాషలో 'మిరట్ ఉల్ అఖ్‌బార్' అనే రెండు వార పత్రికలు ప్రారంభించాడు. 'సంబద్ కౌముది' తొలి సంచికలో ఆయన న్యాయనిర్ణయానికి జూరీ విధానాన్ని అనుసరించడాన్ని ప్రశంసించాడు; పత్రికా స్వాతంత్ర్యాన్ని సమర్థించాడు. 1726 లో 'మేయర్స్' కోర్టులను స్థాపించడంతోబాటే జూరీ విధానంద్వారా న్యాయవిచారణ ప్రారంభమైంది. 1774 లో 'మేయర్స్' కోర్టులకు మారుగా సుప్రీమ్‌కోర్టును స్థాపింపబడినప్పుడు కూడా జూరీవిధానం కొనసాగింది. 1826 మే 5 న పార్లమెంట్ లిన్ అనే ఆయన ప్రవేశపెట్టిన ఇండియన్ జూరీ బిల్లును చట్టం ఆమో

దించింది. అయితే జూరీలో భారతీయులు ఉండడంగురించి ఆ చట్టంలో కొన్ని తేడాలు ఉండేవి. భారతీయులను చిన్న కేసులు విచారించే 'పెటీ జూరీ' (Petty Jury) లో మాత్రమే ఉండనిచ్చేవారు. గ్రాండ్ జూరీ (Grand Jury) లో ఉండడానికీ, క్రైస్తవులను విచారించడానికీ హిందువులకు వీలుండేదికాదు. భారతీయులపట్ల ఇటువంటి ధోరణిని చూపడానికి వ్యతిరేకంగా రామమోహనుడు ఎడతెగక ప్రచారం చేశాడు.

ఆయన బ్రిటిష్ పార్లమెంటుకు ఒక అర్జీని పంపాడు. ఆ అర్జీలో హిందువులు, ముస్లిమ్‌లు కూడా సంతకాలు చేశారు. ఆ అర్జీతోబాటు ఆయన తాను వ్రాసిన సూచనకూడా పంపాడు. 1829 జూన్ 5 నాడు ఆ అర్జీ పార్లమెంటుకు సమర్పించబడింది. 1832 జూన్ 18 నాడు గ్రాంట్ యొక్క ఈస్ట్ ఇండియా జస్టిస్ ఆఫ్ పీస్ అండ్ జూరీ బిల్లు (Grant's East India Justice of Peace and Jury Bill) చట్టంగా ఆమోదింపబడింది. సెరాంపూరు క్రైస్తవ మతబోధకుల పత్రిక అయిన 'సమాచార్ దర్పణ్' ఆ చట్టం ఆమోదింపబడిందని రామమోహనుణ్ణి ప్రశంసించింది.

లార్డ్ వెలెస్లీ కాలంలో పత్రికలమీద సెన్సార్ షిప్ విధానం ప్రవేశపెట్టబడింది. తర్వాత 1818 లో లార్డ్ మోయిరా దాన్ని తొలగించినా, 1823 లో గవర్నర్ జనరల్‌గా వ్యవహరిస్తున్న జాన్ ఆడమ్- పత్రికలకు వ్యతిరేకంగా ఒక నియమాన్ని ప్రవేశపెట్టాడు. స్వదేశీ పత్రికలు పత్రికా స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేస్తున్నాయన్న మిషమీద గవర్నర్ జనరల్‌యొక్క కౌన్సిలులోని సభ్యులలో ఒకడైన డబ్ల్యూ. బి. బేలీ (W. B. Bayley) పత్రికాస్వాతంత్ర్యాన్ని తొలగించడాన్ని సమర్థించాడు. ఆయన 'మీరట్ ఉల్ అఖ్‌బార్'ను ఉదాహరణగా పేర్కొన్నాడు. పత్రికా నియమం అమలుకు రావడంతో 1823 మార్చిలో రామమోహనుడు 'మీరట్ ఉల్ అఖ్‌బార్' ప్రచురణను ఆపేశాడు. 1822 ఆగస్టులో ఆయన ఆ పత్రికలో త్రికసిద్ధాంతం గురించి వ్రాసిన వ్రాతలు 'ఎంతో ఆక్షేపణకరంగా ఉన్నాయి' అని అధికారులు భావించారు.

1822 అక్టోబర్ 10 వ తేదీనాటి సుప్రీమ్ కౌన్సిల్‌వారి కార్యక్రమ సూచికలో ఈ సూచనలు ఉన్నాయి: "మరొక పారశీక పత్రిక అయిన 'మీరట్-ఉల్-అఖ్‌బార్'లో ప్రచురింపబడే విషయాలమీద చెప్పిన దానిలో ఉండే శైలిలోనే ఉంటాయి. అయితే ఈ పత్రికాసంపాదకుడు మతవిషయాలగురించిన చర్చలపట్ల తనకుగల ఆసక్తిని పురస్కరించుకుని త్రిక సిద్ధాంతాన్నిగురించిన అభిప్రాయాలను ప్రచురించడానికి పూనుకున్నాడు. ఆ అభిప్రాయాలు పరోక్షంగానూ, కపటంగానూ వెల్లడించబడినా - అవి నాకు ఎంతో ఆక్షేపణకరంగా ఉన్నాయి." 1823 ఫిబ్రవరి 12 నాడు 'కలకత్తా జర్నల్' సంపాదకుడైన జె. ఎస్. బకింగ్‌హామ్‌ను రెండు నెలలలో భారతదేశంనుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించారు. ఆయన పత్రికలో వెలువడిన కొన్ని వ్యాసాలు ఆక్షేపణకరంగా ఉన్నాయని ప్రభుత్వం భావించింది. ముఖ్యంగా ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారంలో స్టేషనరీ గుమాస్తా ఉద్యోగాన్ని అంగీకరించిన డాక్టర్ బ్రైస్‌ను విమర్శించడం ఆక్షేపణకరంగా ఉందని భావించారు. డాక్టర్ బ్రైస్ న్యూ చర్చ్ ఆఫ్ స్కాట్లాండ్‌కు హెడ్ మినిస్టర్‌గా ఉండేవాడు. చర్చికి చెందిన ఒక మత బోధకుడు అటువంటి ఉద్యోగాన్ని అంగీకరించడం హీనమైన పనిగా బకింగ్‌హామ్ భావించాడు. ఈ వ్యాసం వ్రాసినందుకు 1823 ఫిబ్రవరి 12 నాడు-రెండు నెలలలో భారతదేశాన్ని విడిచివెళ్ళిపొమ్మని ప్రభుత్వం బకింగ్‌హామ్‌ను ఆజ్ఞాపించింది.

ఇలా ఆజ్ఞాపించినవాడు జె. ఆడమ్. ఆయన లార్డ్ హేస్టింగ్స్ వెళ్ళిపోయాక తాత్కాలికంగా గవర్నర్ జనరల్‌గా వ్యవహరించాడు. 'కలకత్తా జర్నల్' ఆగిపోవలసివచ్చింది. ఆ పత్రిక సహాయ సంపాదకుడైన సాండ్‌ఫర్డ్ ఆర్నాట్‌ను ఖైదుచేసి, భారతదేశంనుంచి తరలించారు. 1823 మార్చి 14 నాడు ఆడమ్ కొత్తగా పత్రికాశాసనం ఒకదాన్ని ప్రకటించాడు. దానిప్రకారం పత్రికల యజమానులు, సంపాదకులు ప్రభుత్వం నుంచి తప్పనిసరిగా అనుమతి (లైసెన్సు) సంపాదించాలని విధించాడు. 1823 మార్చి 17 నాడు - అంటే సుప్రీమ్ కోర్టుముందు నమోదుచేయడం

కోసం కొత్త నియమాన్ని ఉంచిన రెండురోజుల తర్వాత—రామమోహనుడు, ద్వారకానాథ్ ఠాగూర్, ప్రసన్నకుమార్ ఠాగూరు, మరి ముగ్గురు కలిసి ఆ నియమానికి వ్యతిరేకంగా సుప్రీమ్‌కోర్టుకూ, ఇంగ్లండు రాజుకూ (King in Council) అర్జీ పెట్టుకున్నారు. రామమోహనుడు వ్రాసిన అర్జీలో ఈ భాగాలు ఉన్నాయి: "ప్రస్తుతం సాగుతున్న జ్ఞానాభివృద్ధి, తద్వారా సాగుతున్న బుద్ధివికాస కృషి పూర్తిగా ఆగిపోతాయి. ప్రాచ్య దేశాలలోని పాండిత్య స్ఫోరకమైన భాషలనుంచి దేశభాషలలోకి చేసే అనువాదాల ద్వారా, విదేశీయ ప్రచురణలనుంచి గ్రహించే సాహిత్య పరిజ్ఞానం ద్వారా జ్ఞానవ్యాప్తి జరగడానికి అవకాశం ఉండదు... పేర్కొనవలసిన మరొక కీడు - ఈ విశాలదేశంలోని వివిధభాగాలకు చెందిన ప్రభుత్వోద్యోగులుచేసే తప్పులను, అన్యాయాన్ని ప్రభుత్వానికి వెనువెంటనే తెలియజేసే అవకాశం స్వదేశీయులకు లేకుండా చేస్తుంది; ఈ దేశప్రజలను ఇంగ్లండులోని తమ కరుణామయుడైన పరిపాలకుడికీ, ఆయన మంత్రివర్గంవారికీ మొగమాటం లేకుండా సత్యంగా మహా ప్రభువుయొక్క పరిపాలనకు లోబడిన ఈ దూరప్రాంతంలోని విశ్వసనీయులైన ప్రజలు స్థానికప్రభుత్వంకింద పొందే అనుభవాల నిజస్వరూపాన్ని గురించి విన్నవించే అవకాశం లేకుండా చేస్తుంది. ఇదివరలోలాగా ఇకముందు స్థానిక ప్రచురణలనుంచి అనువదించి ఆంగ్ల వార్తాపత్రికలతో జతపరచి యూరపునకు పంపుతున్న వాటిద్వారాగాని, ఈ నియమమూ శాసనమూ విధించే ముందు స్థానికప్రజలే స్వయంగా ప్రారంభించదలచుకున్న ఆంగ్ల ప్రచురణలద్వారాగాని - అటువంటి వార్తలు ఇంగ్లండుకు పంపే అవకాశం ఉండదు.

"మానవ ప్రకృతియొక్క అసంపూర్ణతగురించి తెలిసిఉంది, ఈ ప్రపంచ పరిపాలకుడైన పరమేశ్వరుణ్ణి గౌరవించే ప్రతి మంచి పరిపాలకుడూ - ఒక మహా సామ్రాజ్య వ్యవహారాలను నిర్వహించడంలో తప్పు చెయ్యడానికి ఉన్న ఆస్కారంగురించి తెలుసుకుని ఉండాలి. అందువల్ల అతను తన పరిపాలనలోని ప్రతి వ్యక్తికీ తన దృష్టికిరావలసిన విష

యాన్ని తెలియజెయ్యడానికి వీలుకల్పించడానికి పూనుకోవాలి. ఈ ముఖ్యమైన లక్ష్యాన్ని సంరక్షించడానికి ప్రచురణలు చెయ్యడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగించడం ఒకటే సఫలమైన విధానం.

సుప్రీమ్‌కోర్టు ఈ అర్జీని తోసిపుచ్చింది. అందుకు నిరసన తెలియజేస్తున్న తీరులో రామమోహనుడు తన పారశీక వారపత్రిక ప్రచురణను ఆపేశాడు. ఆయన 1831 లో ఇంగ్లండులోని హౌస్ ఆఫ్ కామన్స్ యొక్క సెలెక్ట్ కమిటీముందు ఈస్ట్ ఇండియా కంపెనీ శాసన పునఃప్రారంభవిషయమై సాక్ష్యం చెబుతూ భారతీయులను జాయింట్ అసెసర్లు (Joint Assessors) గాను, సంయుక్త న్యాయమూర్తులు (Joint Judges) గాను నియమించాలని సూచించాడు. ఆయన సామాన్యమైన నమోదు పుస్తకాలను ఉంచే ఏర్పాటు జరగాలనీ, సివిల్ క్రిమినల్ చట్టాల నియమాల నిర్ణయం జరగాలనీ వాదించాడు. ఆయన ప్రభుత్వవ్యయాన్ని తగ్గించాలన్నాడు; స్థిరసైన్యాన్ని తొలగించాలన్నాడు; రైతుల సైన్యం రూపొందాలన్నాడు పరిపాలనాధికారాన్ని న్యాయశాఖనుంచి విడదియ్యాలని ఆయన సూచించాడు.

1842 లో 'ది బెంగాలీ స్పెక్టేటర్' ఇలా వ్రాసింది: "తర్వాతి శాసనం (1833) లో కనిపించే విశేషాధికారాలకు సంబంధించిన సదుపాయం కలిగినందుకు ఆయనకే ఎంతో కృతజ్ఞత చెప్పుకోవాలి." 'సమాచార్ దర్పణ్' ఇలా వ్రాసింది. "దేశానికి ఈ లాభాలను కలిగించడానికి కారకుడు ఆయనే అయితే ఈ తరంవారేకాక, ముందు తరాలవారు కూడా ఆయనను దేశానికి లాభం కలిగించినవాడుగా గుర్తుంచుకుంటుంది." ఇంగ్లండు తాలూకు సాంస్కృతిక రాజకీయ ఉద్యమం భారతదేశంలో పని చేయడానికి నలభై ఏళ్ళ గడువు ఇవ్వవచ్చని రామమోహనుడు అభిప్రాయపడ్డట్టు - ఇంగ్లండులో రామమోహనుడి కార్యదర్శిగా ఉన్న ఆర్నాట్ పేర్కొన్నాడు. ఆ కాలపరిమితిలో ఇంగ్లండు భారతదేశాన్ని ప్రపంచ సంస్కృతికీ, ప్రజాస్వామ్య ప్రభుత్వానికీ సన్నిహితం చేయగలదని రామమోహనుడు నమ్మాడు.

ఇంగ్లండులోని సంస్కరణబిల్లు (Reform Bill) ఉద్యమాన్ని రామమోహనుడు మనస్ఫూర్తిగా సమర్థించాడు. ఆయన అభిప్రాయం ప్రకారం సంస్కరణావాదులకూ, సంస్కరణా వ్యతిరేకులకు మధ్య సాగుతున్న పోరాటం–"ప్రపంచం మొత్తంమీద స్వాతంత్ర్యానికీ, నియంతృత్వానికీ మధ్య సాగుతున్న పోరాటం; న్యాయానికీ అన్యాయానికీ, మంచికీ, చెడుకూ మధ్య జరుగుతున్న పోరాటం. కాని రాజకీయరంగంలోనూ, మతంలోనూ కూడా ఉదారభావాలు క్రమంగా చోటుచేసుకుంటూ ఉండడాన్ని మనం గమనించవచ్చును. స్వపక్ష దురభిమానులూ, సంకుచిత దృక్పథం కలవారూ ఎంతగా వ్యతిరేకించినా, ఎంత మొండిగా వాదించినా–ఈ మార్పు జరుగుతూనే ఉంది."

1832 లార్డ్స్ ఆ బిల్లును చట్టంగా ఆమోదించడంతో రామమోహనుడు ఎంతో సంతోషించాడు. ఆయన తన మిత్రుడైన విలియం రాత్‌బోన్‌కు ఇలా వ్రాశాడు: "తీవ్రమైన వ్యతిరేకత ఉన్నా, ప్రభువులకు రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానం చాలినంతగా లేకున్నా కూడా సంస్కరణ బిల్లు సంపూర్ణ విజయం సాధించడం నాకు సంతోషం కలిగించింది. దేశం–ఇక తమ స్వలాభంకోసం దోపిడీ జరిపే కొందరికి బలికానక్కరలేదు; అలా ప్రజల వినాశనం కొనసాగనక్కరలేదు. దాదాపు యాభై ఏళ్ళనుంచీ సాగుతున్న అక్రమం ఇక సాగనక్కరలేదు. సంస్కరణ బిల్లు విఫలమై ఉంటే నేను బహిరంగంగా చెప్పుకున్నట్లు ఈ దేశంతోడి సంబంధాలన్నిటినీ తెంచుకుని ఉండేవాణ్ణి. ఇప్పుడు నాకు మీతోబాటు ఈ సామ్రాజ్య పౌరుడుగా ఉండడానికి గర్విస్తున్నాను. ఇప్పుడు ఈ దేశవిముక్తిని, ఆ మాటకు వస్తే ఈ ప్రపంచవిముక్తిని చూసే అవకాశం లభించినందుకు నేను మనసారా సంతోషిస్తున్నాను."

ఒక్క భారతదేశానికేగాక ప్రపంచంలోని అన్ని దేశాలకూ స్వాతంత్ర్యమూ, ప్రజాస్వామ్యపు హక్కులూ కావాలంటూ పోరాటం జరగాలని ఆయన ఆదేశించాడు. 1823 లో దక్షిణ అమెరికాలోని స్పైన్ దేశపు వలసలు స్పైన్ నియంతృత్వంనుంచి విడుదలపొందిన వార్త విని

ఆయన తన మిత్రులకు ఒక విందు ఏర్పాటుచేశాడు. ఆయన దాన్ని అంత కోలాహలంగా ఎందుకు ఏర్పాటుచేస్తున్నాడని ఒక మిత్రుడు అడిగాడు. అందుకు "నా తోడిమానవులు ఎక్కడున్నా, వాళ్ళకూ నాకూ ఎలాంటి సంబంధమూ లేకున్నా. వాళ్ళ మతమూ, భాష వేరైనాకూడా - వాళ్ళ కష్టాలగురించి నేను పట్టించుకోకుండా ఎలా ఉండగలను?" అన్నాడు ఆయన. రామమోహనుడి ఆంగ్లేయ మిత్రుడు ఒకాయన 1823 సెప్టెంబరులో 'ఎడిన్‌బర్గ్ మాగజైన్'లో ఇలా వ్రాశాడు: "దక్షిణ అమెరికా స్వాతంత్ర్య పురోగతిగురించి ఆయన చూపిన ఆసక్తి - ఆయన గొప్పతనానికీ, కరుణస్వభావానికీ గుర్తు."

అలాగే పోర్చుగల్లులో సంవిధాన ప్రభుత్వం ప్రవేశపెట్టబడిందని తెలిసినప్పుడు కూడా ఆయన చాలా సంతోషించాడు. టర్కీవారికి వ్యతిరేకంగా గ్రీకులు జరిపిన స్వాతంత్ర్యసమరాన్ని ఆయన బలపరిచాడు. 1815 తర్వాత నేపుల్స్‌లో 'కార్బొనరి' అనే సంఘం నెలకొల్పబడింది. అది ప్రజలమధ్య ఆదరణ గడించింది. 1820-21 లలో నేపుల్స్‌కుచెందిన కార్బొనరి - నేపుల్స్‌కు చెందిన బూర్బాన్ రాజులకు వ్యతిరేకంగా విప్లవం చేశారు. వాళ్లు ఒక సంవిధానాన్ని, అన్ని తరగతులవారి మధ్య సమానత్వాన్ని, ప్రజలకు తమ భవిష్యత్తును నిర్ణయించుకునే హక్కునూ సమకూర్చగలమన్నారు. కాని ఆ విప్లవం అణగదొక్కబడింది. ఆ ఉద్యమనాయకులైన మొరెల్లి, సిల్వాటిలను ఉరితీశారు. ఆ వార్త రామమోహనుణ్ణి ఎంతగానో బాధించింది. దాంతో ఆయన బకింగ్‌హామ్‌తో తాను ఏర్పాటుచేసుకున్న కార్యక్రమాన్ని రద్దుచేశాడు. ఆయన 1821 ఆగస్టు 11 నాడు బకింగ్‌హామ్‌కు ఇలా వ్రాశాడు: "ఈరోజు మధ్యాహ్నం మీ పార్టీలో పాల్గొనలేకపోతున్నందుకు విచారిస్తున్నాను. యూరపునుంచి వెలువడిన వార్తలవల్ల నా మనసు కుంగిపోవడమే ఇందుకు కారణం. ఈ విషాదవార్త విన్నతర్వాత యూరపులోని దేశాలకూ, ఆసియా దేశాలకూ - అందులోనూ ముఖ్యంగా ఆసియాలోని యూరపు వలసదేశాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం రావడాన్ని చూడలేననుకుంటాను. వాటి ఇప్పటి

పరిస్థితిలో పెద్ద మార్పు రాదనుకుంటాను. ఈ పరిస్థితులలో నేపుల్స్‌వారి ఉద్యమం నా సొంతమైనదే అనుకుంటున్నాను. వాళ్ళ శత్రువులు మన శత్రువులుగా పరిగణిస్తున్నాను. స్వాతంత్ర్య విరోధులూ, నిరంకుశులూ ఇదివరలో ఎన్నడూ విజయం సాధించలేదు; ఇకముందు విజయం సాధించనూలేదు.''

బ్రిటిష్‌వారు ఐర్లండును ఆక్రమించడాన్ని రామమోహనుడు వ్యతిరేకించాడు. 'మీరట్ ఉల్ అఖ్‌బార్'లో ఆయన ఆ వ్యతిరేకతను వ్యక్తంచేశాడు. క్షామపీడితులైన ఐర్లండు ప్రజల సహాయార్థం ఆయన చందాలు పంపించాడు. ఫ్రెంచి విప్లవంగురించిన సందేశం విని ఆయన ఉబ్బి తబ్బిబ్బైపోయాడు. ఫ్రెంచి విప్లవపతాకానికి వందనం చేయడం కోసం పడవనుంచి దిగబోతూ ఆయన కాలు గాయపరచుకున్నాడు. రామ మోహనుడికి స్వాతంత్ర్యమంటే అంతులేని ప్రేమ ఉండేది. ఆయన తల పెట్టిన మత, సాంఘిక, రాజకీయ కార్యక్రమాలన్నిటిలోనూ స్వాతంత్ర్య ప్రేమ ప్రధానాంశంగా కనిపిస్తుంది. అయన స్వాతంత్ర్యప్రేమ-మానవ జాతికంతటినీ సంబంధించింది. 18 వ శతాబ్దంలో అంతర్జాతీయవాది దృక్పథంగల మొదటి వ్యక్తి ఆయనే.

రామమోహనుడు-ఫ్రెంచి విదేశాంగమంత్రి అయిన ప్రిన్స్ టాలి రండ్‌కు 1831 డిసెంబర్ 26 నాడు లండన్‌నుంచి తాను ఫ్రాన్స్‌కు రావ డాన్ని అనుమతించే పాస్‌పోర్టును జారీచెయ్యమని కోరుతూ ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం ఎంతో ప్రత్యేకమైనది. ఈ ఉత్తరంలో రామ మోహన్‌రాయ్ పాస్‌పోర్టులు ఇచ్చే విధానాన్ని రద్దుచేయాలని కోరాడు. ఆయన ఇలా వ్రాశాడు: "ఇటువంటి విధానం ఒక్క చైనాలో తప్ప తక్కిన ఆసియా దేశాలు (ఆ దేశాలు మతపక్షపాతాలవల్లా, రాజకీయ వివాదాలవల్లా పరస్పరం విరోధం వహించినా) వేటిలోనూలేదు. చైనా వాళ్ళకుమాత్రం విదేశీయులంటే విపరీతమైన ఈర్ష్య; వాళ్ళు కొత్త సంప్ర దాయాలన్నా, భావాలన్నా సుముఖత చూపరు. అందువల్ల, అటువంటి విధానం-తమ సౌజన్యం, ఔదార్యాలద్వారా ప్రసిద్ధి గడించిన ఫ్రెంచి దేశ

స్థులు అనుసరించడం నాకు విచారకరంగా ఉంది. మతం ఒక్కటేకాక, నిష్పక్షపాతమైన లోకజ్ఞానమూ, వైజ్ఞానిక పరిశోధనలవల్ల కలిగే కచ్చితమైన ఊహలుకూడా - మానవజాతి అంతా ఒక పెద్ద కుటుంబానికి చెందినవన్న నిర్ణయానికే దారి తీస్తున్నాయని విశ్వసిస్తున్నారు; వివిధదేశాలు, తెగలు ఆ కుటుంబంలోని వివిధ భాగాలు మాత్రమే. మొత్తం మానవజాతియొక్క ప్రయోజనానికీ. ఆనందానికీ దోహదంచేసే తీరులో మానవుల మధ్య అన్ని విధాలుగానూ పరస్పరసంబంధం కలిగేలా చూడాలని అన్ని దేశాలలోని మేధావులు కోరుకుంటారు.''

ఈ ఉత్తరంలోనే ఆయన దేశాలమధ్య వచ్చే వివిధ సమస్యలను సర్దుకోడానికి తోడ్పడే పటిష్ఠమైన అంతర్జాతీయ వ్యవస్థను నెలకొల్పాలని సూచించాడు. ఆయన ఇలా వ్రాశాడు : ''రెండు దేశాలమధ్య రాజకీయంగా వచ్చే ప్రతి విభేదాన్నీ - ఆ రెండుదేశాల శాసనసభల సభ్యులనుంచి సమాన సంఖ్యగలవారిని ఎన్నుకొని రూపొందించిన వ్యవస్థకు నివేదించాలి. అలా చేస్తే సంవిధానప్రభుత్వపు ఆశయాలు సఫలం కాగలవని నాకు అనిపిస్తున్నది. అటువంటి వ్యవస్థలో ఎక్కువమంది సభ్యుల నిర్ణయాన్ని రెండు దేశాలూ అంగీకరించాలి. అలాగే ప్రతి యేడాదీ ఆ వ్యవస్థ అధ్యక్షులను రెండుదేశాల సభ్యులనుంచీ వంతులవారీగా ఎన్నుకోవాలి: వ్యవస్థ సమావేశంకూడా ఒక ఏడాది ఒక దేశంలోను. రెండవ యేడాది రెండవ దేశంలోనూ జరుపుకోవచ్చు. ఇటువంటి వ్యవస్థద్వారా సంవిధాన ప్రభుత్వాలుగల ఏ రెండు నాగరకదేశాల పౌరులనైనా బాధించే రాజకీయ, వ్యాపార విభేదాలను రెండు దేశాలవారికీ ఆమోదంకలిగించే తీరులో సక్రమంగా, సంతృప్తికరంగా తీర్చుకోవచ్చును. అలా ఆ రెండుదేశాల పౌరులమధ్య శాంతినీ, సౌభ్రాతృత్వాన్నీ పెంపొందించి తరతరాలూ వారి మధ్య శాంతియుత సహజీవనం సమకూరేలా చెయ్యవచ్చును.''

ఈ చిరస్మరణీయమైన వాక్యాలనుబట్టి 1831 లోనే దేశాలమధ్య చెలరేగే విభేదాలను సర్దుకోవడానికీ, ప్రపంచశాంతిని పెంపొందించడానికి పటిష్ఠమైన అంతర్జాతీయ వ్యవస్థ అవసరాన్ని గ్రహించాడని భావించ

వచ్చు నానాజాతిసమితిగాని, ఐక్యరాజ్యసమితిగాని రూపొందడానికి చాలా కాలం ముందే - ఆ ఊహాప్రపంచం ఏ రాజకీయ మేధావికీ కలగడానికి ముందే రామమోహనుడు అటువంటి వ్యవస్థ రూపొందగల దని ఆశించాడు.

## మార్గదర్శకుడైన పత్రికా రచయిత

రామమోహన్‌రాయ్ పురికొల్పిన సాంఘిక, విద్యా, ఆర్థిక, రాజకీయ, మతసంస్కరణల ద్వారా చెలరేగిన చైతన్యానికి ఉదారవాద ధోరణిలో పనిచేసే పత్రికల సాయం అవసరమైంది. ఆ కాలపు అవసరమే బెంగాలులో - అందులోనూ ముఖ్యంగా కలకత్తాలో పత్రికలు పెంపొందడానికి దోహదం చేసింది.

కలకత్తాలో ప్రారంభమైన తొలి ఉదారవాద పత్రిక 'బంగళా గెజెట్.' ఆ వంగ వారపత్రిక 1816 లో ప్రారంభమైంది. 1820 దాకా కొనసాగిన ఆ పత్రికను రామమోహనుడి 'ఆత్మీయ సభ' సభ్యులు నిర్వహించేవారు.

సెరాంపూరు క్రైస్తవ మఠంవారు 1817 లో 'సమాచార్ దర్పణ్' అనే వంగ వారపత్రికను ప్రారంభించారు. వారు 'ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' అనే ఆంగ్లపత్రికను కూడా ప్రచురించేవారు.

ఆంగ్లంలో వెలువడిన తొలి ఉదారవాద పత్రిక - 'ది కలకత్తా జర్నల్.' 1818 అక్టోబరులో జేమ్స్ సిల్క్ బకింగ్‌హామ్ ఆ పత్రికను ప్రారంభించాడు.

తారాచంద్ దత్త, భవానీచరణ్ బంద్యోపాధ్యాయ కలసి 1820 లో 'సంబద్ కౌముది' అనే వంగ వారపత్రికను ప్రారంభించారు. భవానీచరణ్ ఆ పత్రిక సంపాదక బాధ్యతనుంచి తప్పుకోగానే, రామమోహనుడు ఆ బాధ్యతను స్వీకరించాడు.

రామమోహనుడు 'మీరట్ ఉల్ అఖ్‌బార్' అనే పారశీక వార పత్రికను ప్రారంభించాడు. 1823 అది ఆగిపోయింది.

'సమాచార్ చంద్రిక' సనాతన హిందువుల సాధనంగా పనిచేసింది.

1829 లో డాక్టర్ ఆర్. ఎమ్. మార్టిన్ 'బెంగాల్ హెరాల్డ్'ను ప్రారంభించాడు. ఆయనమీద ద్వారకానాథ్ ఠాగూరుప్రభావం ఎక్కువగా ఉండేది. ఆ పత్రిక యాజమాన్యంలో రామమోహన్‌రాయ్, ద్వారకానాథ్ ఠాగూరు కూడా ఉండేవారు.

రామమోహనుడి అనుచరుడైన నీలరతన్‌హల్దార్ 'బంగదూత్' అనే వారపత్రికకు సంపాదకుడుగా పనిచేసేవాడు. ఆ పత్రిక, వంగ, పారశీక, నాగరీ భాషలలో వెలువడేది.

సామ్యుయేల్‌స్మిత్ అనే ఆయన 'బెంగాల్ హర్కారు'ను ప్రారంభించాడు. ఆయన పుస్తకాల విక్రేత, ప్రచురణకర్త. ద్వారకానాథ్ ఠాగూరు విరివిగా డబ్బిచ్చి 'బెంగాల్ హర్కారు'కు తోడ్పడేవాడు.

1831 లో 'ది ఇండియా గెజిట్' ప్రారంభమైంది. ద్వారకనాథ్ ఠాగూరు దాని యజమానులలో ఒకడు. ఆ పత్రిక అప్పట్లో ప్రముఖమైన ఆంగ్ల పత్రిక.

1821 లో ప్రారంభమైన 'జాన్‌బుల్' ఉదారవాదానికి వ్యతిరేకమైనది. అది దాదాపు ప్రభుత్వపరమైన పత్రికగానే ఉండేది. 1832 లో దాన్ని అమ్మేశారు. ద్వారకానాథ్ ఠాగూరు స్నేహితుడైన స్టాక్వెలెర్ (Stocqueler) ఆ పత్రికను కొన్నాడు. ఆ కొనడానికి ద్వారకానాథ్ ఠాగూరు ధనసహాయం చేశాడు. ఆ పత్రిక పేరును 'ది ఇంగ్లీష్‌మేన్' (The Englishman) గా మార్చారు.

రవీంద్రనాథ్ ఠాగూరు తాత అయిన దేవేంద్రనాథ్ ఠాగూరు అద్వితీయమైన ప్రతిభావంతుడు; ధనవంతుడు. గొప్ప పలుకుబడి కలవాడు- అని ఇక్కడ పేర్కొనవలసి ఉంది. ఆయన ఉదారప్రవృత్తి కలవాడు. ఆయన రామమోహన్‌రాయ్‌పట్ల ఎంతో ఆసక్తి చూపేవాడు. ఆయన రామ

మోహనుడికి సన్నిహిత మిత్రుడు. రామమోహనుడు చేపట్టిన సంస్కరణ కార్యక్రమాలన్నిటికీ ద్వారకానాథ్ ఠాగూరు నిర్విరామంగా, విశ్వసనీయంగా సాయం చేశాడు.

19 వ శతాబ్ది తొలి భాగంలో కలకత్తాలో ఉదారవాద ధోరణిగల పత్రికల స్థాపనకు ద్వారకానాథ్ ఎంతో కృషిచేశాడు. రామమోహన్‌రాయ్ ఉద్బోధిస్తున్న ఉద్యమానికి అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని రూపొందించాలన్న ఉద్దేశంతో ఆయన ఆ కృషిచేశాడు. రామమోహన్‌రాయ్ పురికొల్పిన రాజకీయ ఉదారవాదాన్ని బలపరచడంకోసం, బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడైన జార్జి తాంప్సన్ (George Thompson) ను భారత దేశానికి ఆహ్వానించి, తీసుకువచ్చినవాడు – ద్వారకానాథ్ ఠాగూరే. జార్జి తాంప్సన్ అప్పట్లో ఉదారవాద నాయకుడుగానూ, ఉపన్యాసకుడుగానూ ఎంతో ప్రసిద్ధి గడించినవాడు.

బెంగాలులోని పత్రికారంగం – రామమోహన్‌రాయ్ ప్రారంభించిన ఉద్యమమానికీ, ద్వారకానాథ్ ఠాగూరుయొక్క ఉదారవాదానికీ, దూర దృష్టితోకూడిన దాతృత్వానికీ ఋణపడి ఉంది.

## ఆర్థిక సంస్కరణ

భారతదేశ ప్రజలదీనమైన ఆర్థికస్థితికి బాగుపరచడానికి రామమోహనుడు నిర్విరామంగా కృషిచేశాడు. 1832 లో పార్లమెంటరీ కమిటీ ముందు సాక్ష్యం చెబుతూ రామమోహనుడు ఇలా చెప్పాడు: "రైతుల పరిస్థితి చాలా హీనంగా ఉంది. వారు జమీందారుల దురాశ, లోభాలకు బలి అయ్యే స్థితిలో ఉన్నారు. భూస్వాముల ఆదాయాన్ని విలువకట్టడంలో ప్రభుత్వం దాక్షిణ్యం చూపిస్తుంది. బీద రైతులమీద ఆ దాక్షిణ్యం ఏమాత్రమూ చూపించడంలేదు." 1793 నాటి శాశ్వత నిర్ణయంవల్ల జమీందార్లు ఎక్కువ లాభంపొందారనీ, పేదరైతులస్థితి ఏమాత్రమూ

బాగుపడలేదనీ ఆయన సూచించాడు. కౌలు చాలా ఎక్కువగా చెల్లించ వలసి ఉండడంతో, రైతులకు మిగులు అంటూ ఏదీ ఉండేది కాదు. కౌలును తగ్గించాలనీ, మరేమాత్రమూ పెంచకూడదనీ రామమోహనుడు పేర్కొన్నాడు. ఆయన రైతులతో శాశ్వతనిర్ణయం ఒకటి చేసుకుని, దానిద్వారా జమీందార్లు భూమికౌలు పెంచి, బీద రైతులను హింసించకుండా చూడాలని సూచించాడు. శాశ్వతనిర్ణయం మూలంగా ఇలా కౌలును తగ్గించడంవల్ల తగ్గే ఆదాయాన్ని విలాసవస్తువులమీద పన్నులు వెయ్యడం ద్వారా, ఎక్కువ జీతాలుతీసుకునే యూరోపియనుల స్థానాలలో భారతీయులను కలెక్టర్లుగా నియమించడం ద్వారా సర్దుకోవచ్చని ఆయన చెప్పాడు. జమీందార్లకు సొంతమైన గ్రామాల సంతల్లో - తాము పండించిన పంటనో, కాయగూరలనో అమ్మడానికివచ్చే రైతులదగ్గర ఆ జమీందార్లు పన్ను వసూలు చెయ్యడాన్ని ఆయన ఎదుర్కొన్నాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగులు ఉప్పు వర్తకాన్ని గుత్తకు తీసుకోవడాన్ని ఆయన ప్రతిఘటించి పోరాడాడు. వాళ్ళు ఉప్పు ధరను దాని సహజమైన ధరకన్నా వెయ్యిరెట్లు పెంచేసేవారు మొలంఘీలు అనే పేరుగల లక్ష ఇరవై ఐదువేలమంది శ్రామికులు బెంగాలులో ఉప్పు తయారు చెయ్యడానికి పాటుపడేవారు. వాళ్ళు బానిసలలాగా ఉండేవారు. ప్రభుత్వం ఉప్పు తయారీకోసం ప్రతినిధులను (Agents) నియమించేది. ఉప్పును కలకత్తాకు తరలించుకుపోయి, అప్పుడప్పుడూ పెద్దయెత్తున అమ్మేవారు. ఈ వర్తకం కొంతమంది భారతీయులకు పరిమితమై ఉండేది. వాళ్ళు ఉప్పును అమ్మేముందు కల్తీచేసి, మరీ అమ్మేవారు. కంపెనీ విదేశాల నుంచి దిగుమతి అయ్యే ఉప్పుమీద బోలెడంత దిగుమతిశుల్కం విధించేది.

రామమోహనుడు ఈ ఉప్పు వ్యాపారం గుత్తవిధానానికి వ్యతిరేకంగా ఉద్యమం జరిపాడు. ఉప్పుధర తగ్గితే, దాని ఉపయోగం పెరుగుతుందనీ, ప్రజలందరూ ఉప్పు ధర ఎక్కువగా ఉండడంవల్ల బాధపడుతున్నారనీ ఆయన వాదించాడు. ఆయన చౌకగానూ, ప్రశస్తంగానూ ఉండే ఆంగ్లదేశపు ఉప్పును దిగుమతి చేసుకోవడానికి అనుమతించా

లన్నాడు; మొలంఘీలను వ్యవసాయకృషిలో నిమగ్నులను చెయ్యా లన్నాడు. ఉప్పులో కల్తీ బాగా ఎక్కువగా ఉన్నదంటూ, అది వినియోగ దార్లకు చేరేసరికి మామూలు మట్టికీ ఉప్పుకూ తేడా ఉండడంలేదని పేర్కొన్నాడు ఆయన. గుత్తవిధానానికి వ్యతిరేకంగా రామమోహన్‌రాయ్ తీసుకున్న నిర్ణయాన్ని పార్లమెంటరీ సెలక్ట్ కమిటీ సమర్థించింది. అలా రామమోహనుడి ఉద్యమం ఫలించింది. ఈస్ట్ ఇండియా కంపెనీవారు ఉప్పు వ్యాపారాన్ని గుత్తకు తీసుకునే విధానం తొలగింపబడింది.

భారతదేశపు సంపదలను బ్రిటిష్ పరిపాలకులు క్రమక్రమంగా తరలిస్తున్నారన్న విషయాన్ని భారతీయులదృష్టికి తెచ్చిన తొలి వ్యక్తి రామమోహనుడే. అది భారతదేశంనుంచి దాని విజేతలు వసూలుచేసే కప్పంలా ఉండేది. 'భారతదేశంలోని ఆదాయ వ్యవస్థ' (Revenue System of India) కు సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ ఆయన భారతదేశంలో ఉద్యోగాలుచేసి విరమణపొందే యూరోపియనులు పెద్ద మొత్తాలను తమతో తీసుకుపోతున్నారన్నాడు. ఈ సంపదల తరలింపు తీరును ఋజువుచెయ్యడానికి ఆయన కొన్ని పట్టికలు తయారు చేశాడు. ఆయన ఆ విషయంగురించి ఇలా వ్రాశాడు: "శ్రీయుతులు లాయిడ్, మెల్విల్లీ (మొదట అకౌంటెంట్ జనరల్; తర్వాత ఈస్ట్ ఇండియా కంపెనీకి ఆడిటర్ జనరల్) హవుస్ ఆఫ్ లార్డ్స్‌వారి సెలక్ట్ కమిటీ ముందు 1130 ఫిబ్రవరి 23 నాడు చెప్పిన సాక్ష్యాన్నిబట్టి–ఇంగ్లండులో ప్రాంతాల లెక్కకింద భారతదేశంనుంచి తీసుకువెళ్ళిన డబ్బుతో చేసిన ఖర్చు ప్రతియేటా సగటున దాదాపు 30 లక్షల పౌండ్లు ఉంటుందని తెలుస్తున్నది. ఈ సాక్ష్యం సెలక్ట్ కమిటీవారి సాక్ష్యాల నివేదికలో నమోదు చేయబడింది. ఈ ఖర్చులో–కార్యనిర్వాహక బృందం (Board of Contol), ఇండియా హవుస్ (India House) ల కోసం ఖర్చుపెట్టే మొత్తంకూడా ఇమిడి ఉంది; భారతదేశంలో పనిచేసిన ఉద్యోగులకు విశ్రాంతి వేతనాలు ఇవ్వడానికీ, సెలవుమీద యూరపులో ఉన్న సివిల్, మిలిటరీ ఉద్యోగులకు ఆబ్సెంటీ అలవన్సుల పేరిట వేతనాలు చెల్లించ

డానికి, భారతదేశంలో వడ్డీతోసహా వసూలుచేసిన మొత్తాలు చెల్లించడానికి అయ్యే ఖర్చులుకూడా ఇందులో చేరుతాయి. ఇవికాక భారతదేశానికి సంబంధించిన స్థానికమైన గిడ్డంగికోసం 4,53,511 పౌండ్లు ఖర్చవు తున్నది."

బెంగాలులో - కంపెనీలో ఉన్నతోద్యోగం నిర్వహిస్తున్న సమర్థుడైన ఒక ఉద్యోగి 1810 జూన్ 28 నాడు బెంగాలు ప్రభుత్వపు దర్శక బృందానికి (Board of Directors of the Government of India) ఒక ఉత్తరం వ్రాశాడు. 'ఆన్ కలొనియల్ పాలిసీ ఆన్ అప్లికబుల్ టు ది గవర్నమెంట్ ఆఫ్ ఇండియా' (On Colonial Policy as applicable to the Government of India) అనే పుస్తకంలో పేర్కొనబడింది. ఆ ఉత్తరంలో "ప్రత్యేక వ్యక్తులకోసం ప్రతి యేటా లండన్‌కు పంపుతున్న మొత్తం - ఈ మధ్య కొన్నేళ్లనుంచీ దాదాపు 20 లక్షల పౌండ్లు ఉంటుందని చెప్పవచ్చు. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు," (పుట 70) అని వ్రాశాడు. వీటినిబట్టి, తక్కిన ప్రామాణిక ఆధారాలనుబట్టి ఈ ఉత్తరంవ్రాసిన వ్యక్తి "భారతదేశంనుంచి 1765 నుంచి 1820 ల మధ్య ఏదో ఒక రూపంలో వసూలుచేసిన మొత్తం కనీసం నూరుకోట్ల పౌండ్లు ఉండవచ్చు" అని వ్రాశాడు.

ఇంగ్లండులో స్వతంత్ర వర్తకులకూ, గుత్త వర్తకులకూ మధ్య పెద్ద పోరాటం ప్రారంభమైంది. రామమోహనుడు స్వతంత్ర వర్తకుల పక్షం అవలంబించాడు. అందులో ఆయనకు ద్వారకనాథ్ ఠాగూరు సాయం లభించింది. భారతదేశం - ముస్లిమ్ పరిపాలనయొక్క తుది దశాబ్దంలో పొందిన మందస్థితిని తొలగించి భారతదేశాన్ని ఉద్ధరించడానికే చరిత్ర బ్రిటిష్ పరిపాలనను విధించిందని ఆ యిద్దరూ విశ్వసించారు. భారతదేశం చాలాకాలంనుంచి ప్రపంచ చరిత్రగతికి వెలుపల, దూరంగా ఉండిపోయింది. భారతదేశాన్ని ప్రపంచశక్తి ప్రవాహంలో పడదోసి, దాని ఉనికికి సంబంధించిన ప్రతి రంగంలోనూ ఆ శక్తిని ప్రతిబింబించేలా చేసే చరిత్రాత్మక బాధ్యతను ఇంగ్లండు స్వీకరించింది. ఆర్థికరంగంలో కూడా పారిశ్రామిక

విప్లవాన్ని ప్రారంభించే కృషిని తనకు తెలియకుండానే ఇంగ్లండు నెర వేర్చింది. బెంగాలులోని గ్రామ ప్రాంతాలలో ఆంగ్లేయులు పరిశ్రమలు స్థాపించే కృషి చేశారు. రామమోహనుడు, ద్వారకానాథ్ ఠాగూరు ఆ కృషిని ప్రోత్సహించారు. జమీందారుల నిరంకుశత్వానికి ఎడతెరపి లేకుండా బలి అవుతున్న బీదలకు అదొక విముక్తిమార్గాన్ని చూపగలదని వాళ్ళు భావించారు చరిత్రాత్మక విధానాలన్నిటిలాగానే ఆ విధానంకూడా క్రూర మైనదిగానే కనిపించింది. అయితే అది తప్పనిసరి అయినది భూస్వామ్య ఆర్థికవిధానంనుంచి పెట్టుబడిదారీ విధానానికీ మార్పు చెందడం-ప్రపంచంలో ఎక్కడా సులభంగానూ, సున్నితంగానూ జరగలేదు. భారతదేశంలో కూడా అంతే జరిగింది. భారతదేశంలో సాగిన ఈ ఆర్థిక విప్లవాన్ని రామమోహనుడు ప్రోత్సహించాడు. అందులో ఆయనకు తన మిత్రుడైన ద్వారకానాధ్ ఠాగూరు ప్రోత్సాహం లభించింది.

## బ్రహ్మ సభ - బ్రహ్మ సమాజం

1827 లో అర్. డట్టన్‌కు వ్రాసిన ఉత్తరంలో రెవరెండ్ విలియమ్ ఆడమ్ ఏకేశ్వరోపాసకుల సంఘాన్ని (unitarian Association) గురించి ఇలా వ్రాశాడు: "ప్రస్తుతం దాని సభ్యులు - సుప్రీం కోర్టు బారిస్టర్ అయిన తియోడార్ డికెన్స్; మెకింతోష్ అండ్ కంపెనీకి చెందిన వర్తకుడైన జార్జ్ జేమ్స్ గోర్డన్; విలియమ్ టేట్ అనే అటార్నీ; కంపెనీ ఉద్యోగంలో ఉన్న బి. డబ్ల్యూ. మెక్లియడ్ అనే శస్త్రవైద్యుడు; ఒప్పందం చేసుకొని కంపెనీ ఉద్యోగి అయిన నార్మన్ కెర్, రామమోహన్‌రాయ్, ద్వారకానాథ్ ఠాగూర్, ప్రసన్నకుమార్ ఠాగూరు, రాధాప్రసాదరాయ్ (రామమోహనుడి పెద్ద కొడుకు), నేను."

ఏకేశ్వరోపాసకుల సంఘం క్షీణించింది. ఆ సంఘం విఫలమయ్యాక రామమోహనుడి అనుచరులు - వెంటనే ఏకేశ్వరోపాసకులకు ప్రత్యేకమైన సంస్థ ఒకటి స్థాపించవలసిన అవసరాన్ని గుర్తించారు. రామమోహనుడి

శిష్యుడైన చంద్రశేఖర్‌దేబ్ - ఏకేశ్వరోపాసకులు ఎటువంటి ఆటంకమూ లేకుండా సమావేశం కావడానికి ఒక ప్రత్యేక స్థలాన్ని కల్పించమని రామమోహనుణ్ణి ప్రార్థించాడు. రామమోహనుడు చంద్రశేఖర్‌దేబ్ సలహా పాటించాడు. అలా 1828 ఆగస్ట్ 20 నాడు బ్రహ్మసభ ప్రారంభించబడింది. చంద్రనాగూరుకు చెందిన రామకమల్‌బసు ఇంటిని అద్దెకు తీసుకున్నారు. రామకమల్‌బసు కలకత్తాలో 'ఫిరంగి కమల్‌బసు'గా ప్రసిద్ధుడు. యూరోపియనులతో వర్తకసంబంధాలు కలిగిఉండడంవల్ల ఆయనకు ఆ పేరు వచ్చింది. బ్రహ్మసభకు మొదటి నివాసమైన ఆ అద్దె యిల్లు చిత్పూర్ రోడ్డులోని 48 వ నెంబరుది. రామమోహనుడి శిష్యుడైన తారాచంద్ చక్రబర్తి సభకు మొదటి కార్యదర్శిగా నియమింపబడ్డాడు. బ్రహ్మసభ రెండేళ్ళపాటు ఆ అద్దెయింట్లో ఉంది. 1830 జనవరి 28 నాడు అది తన సొంత భవనానికి తరలింది. బ్రహ్మసభ ప్రారంభం కావడంతో, అందుకు వ్యతిరేకంగా సనాతన హిందువులు ధర్మసభ అనే సంఘాన్ని ప్రారంభించారు. దానికి సనాతన హిందువుల విశ్వాసపాత్రుడైన నాయకుడు రాధాకాంతదేబ్ నాయకత్వం వహించాడు.

1830 జనవరి 23 నాడు బ్రహ్మసభ తన సొంత భవనానికి తరలింది. కొత్త భవనంలో బ్రహ్మసభ ప్రారంభమైన రోజున ఒక్కగానొక్క యూరోపియను అక్కడ హాజరయ్యాడు. ఆయన పేరు మాంటగోమరీ మార్టిన్. ఆయన ఆ ప్రారంభోత్సవం గురించి తన 'హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ కాలనీస్' అనే పుస్తకంలో ఆసక్తికరంగా వ్రాశాడు. ఆ వ్రాతలనుబట్టి - ఆ ప్రారంభోత్సవానికి 500 మంది హిందువులు హాజరైనట్టు తెలుస్తున్నది. ప్రారంభోత్సవానికి ముందే 1830 జనవరి 8 నాడు రామమోహనుడు సభయొక్క ధర్మశాసనాన్ని (Trust deed) రూపొందించాడు. ఈ ధర్మశాసనం - తన విశాలదృక్పథంవల్లా, విశ్వజనీనతవల్లా పేర్కొనదగింది. ఆ ధర్మశాసనంలో "అనంతుడు, అన్వేషణకు అందనివాడు, నిర్వికారుడు, ఈ విశ్వసృష్టికి కారకుడు, రక్షకుడు అయిన పరమాత్మను సక్రమంగా, శాంతంగా, భక్తిశ్రద్ధలతో పూజించడానికి పూను

కునేవారందరికీ ధర్మకర్తలు ఎటువంటి తేడా చూపకుండా ఈ భవనాన్ని ఉపయోగించుకోనివ్వాలి. ధర్మకర్తలు ఈ భవనాన్ని-దీనిలోని భూమినీ, తదితర సౌకర్యాలను - అన్ని రకాలవారూ, అన్నిరకాల బహిరంగ సమావేశాలనూ ఏర్పాటుచేసుకోవడానికి అనువుగా అన్ని సందర్భాలలోనూ అందుబాటులో ఉంచడానికి అనుమతించాలి. ఒక వ్యక్తిగాని, కొందరు వ్యక్తుల బృందంగానీ పూజించే చేతనాచేతన పదార్థం దేన్నయినా దూషించడంకానీ, కించపరచడంగానీ, అపహాస్యం చెయ్యడంగానీ కూడదు. ఇవి బోధనల రూపంలోగాని, ప్రార్థనల రూపంలోగాని, భక్తిగీతాల రూపంలోగాని, పూజావిధానాల రూపంలోగాని సాగకూడదు. ఈ విశ్వసృష్టికి కర్త, రక్షకుడు అయిన భగవంతుణ్ణి గురించి బోధించడానికీ, ఆలోచించడానికీ అలా దాతృత్వాన్నీ, నైతిక ధోరణినీ, భక్తినీ, దయాగుణాన్నీ, సద్గుణాలనూ ప్రోత్సహించడానికీ, వివిధ మతాలను అనుసరించే మానవులమధ్య సమైక్యతాబంధాలను పెంపొందించడానికీ కృషి జరగవచ్చు," అని పేర్కొన్నాడు.

ఈ ధర్మశాసనంలోని విషయాలనుబట్టి రామమోహనుడు-బ్రహ్మసభ ఒక కొత్త మతవర్గంగా ఉండాలని భావించలేదని స్పష్టమవుతుంది. బ్రహ్మసభను అన్ని మతాలకూ చెందిన ఏకేశ్వరోపాసకులు ఉపయోగించుకోవాలని ఆయన భావించాడు. రూపరహితుడు, అనంతుడు, అన్వేషణకు అందనివాడు, నిర్వికారుడు అయిన - ఒక్కగానొక్క భగవంతుణ్ణి నమ్మే అన్ని మతాలవారు అక్కడ సమావేశంకావాలని ఆయన ఆశించాడు. రామమోహనుడు తాను విశ్వమతానికి చెందినవాడుగా పేర్కొనేవాడు. తాను మరణించిన తర్వాత హిందువులు, ముస్లిమ్‌లు, క్రైస్తవులు ఎవరికి వారు - తాను వాళ్ళ మతానికి చెందినవాడుగా పేర్కొంటారని ఆయన ఒక మిత్రుడికి చెప్పాడు. అయితే తాను ఏ మతానికి చెందినవాడు కాననీ, విశ్వమత భక్తుడిననీ ఆయన చెప్పాడు. బొంబాయి రాజధాని ప్రాంతంలో ఉదార సంస్కరణావాదానికి మార్గదర్శకుడైన ఎం. జి. రానడే ఈ ధర్మశాసనంగురించి ఇలా వ్రాశారు: "ఈ ధర్మశాసనపు పరతత్త్వభావం,

గాఢభక్తి. విశ్వజనీనమైన సహనం - సౌందర్య. సమగ్రతలతో కూడిన ఆశయాన్ని సూచిస్తున్నాయి. వాటి పరిపూర్ణమైన అర్థాన్ని మన ప్రజలు గ్రహించడానికి ఇంకా ఎన్నో శతాబ్దాలు పట్టవచ్చు." భారత పత్రికా రచయితలలో ప్రముఖుడైన రామానంద చటర్జీ ఇలా చెప్పారు: "ఆయన (రామమోహనుడు) బ్రహ్మసమాజాన్ని నెలకొల్పినప్పుడు, భగవంతుణ్ణి పూజింపడంకోసం సమావేశం కాదలుచుకున్న వారికందరికీ అది కేంద్రం కావాలని ఆశించాడు" 1906 లో కలకత్తాలో జరిగిన ఆస్తిక మహాసభ (Theistic Conference) కు అధ్యక్షత వహించిన బ్రహ్మర్షి ఆర్. వెంకటరత్నం తన అధ్యక్షోపన్యాసంలో ఇలా చెప్పారు: "శాశ్వతమైన ఈ ధర్మశాసనం - బ్రహ్మసమాజం ఆశయాన్ని చక్కగా వివరించింది. బ్రహ్మసమాజం - దేవుణ్ణి పూజించదలుచుకున్న వారందరికీ ఎటువంటి పక్షపాతధోరణీలేని కేంద్రంగా ఉండాలని ఆశించబడింది. మతభేదదృష్టి గానీ, మతద్వేష దృక్పథంగానీ లేకుండా ఒక మనిషి మరొక మనిషితో సఫలవంతమైన సంపర్కాన్ని పెంపొందించుకోవడానికి; నైతికదృష్టి, భక్తి, దాతృత్వగుణం, దయాగుణంవంటి గొప్ప సుగుణాలను ప్రోత్స హించడానికి బ్రహ్మసమాజం ఉద్దేశింపబడింది." భారతీయ సంఘసంస్కర్త లలో ప్రముఖుడైన కేశవచంద్రసేన్ 1865 జూలై 1 నాడు 'ఇండియన్ మిర్రర్' పత్రికలో ఇలా వ్రాశాడు. "ఆయన (రామమోహనుడు) ఇది వరలో ఉన్న ఏ మతవిభాగానికీ చెందినవాడుకాడు. అలాగే ఆయన పరి శుద్ధమూ, దోషరహితమూ అయిన కొత్త మతం దేన్నీ స్థాపించడానికి గానీ, ప్రారంభించడానికిగానీ పూనుకోలేదు. ప్రపంచంలో ఉన్న మతా లన్నిటికీ చెందిన మనుష్యులందరినీ - వాళ్ళ కులంతోగానీ, రంగుతోగానీ, మతంతోగానీ నిమిత్తంలేకుండా సమైక్యంచేసి, అసలైన ఒక్క భగవం తుణ్ణే పూజించే విశ్వజనీనమైన వ్యవస్థను నెలకొల్పడమే ఆయన ఆశయం. అలా ఆయన విశాలహృదయం - ఏ మతానికీ, ఏ తెగకూ చెందిందికాదు; ఆయన ఏ మతసభలోనూ సభ్యుడు కాడు. కాని, అన్ని మతసభలూ ఆయనవే. ఏకేశ్వరోపాసనా సిద్ధాంతంపై ఆధారపడి విశ్వజనీనమైన మత

సభను నెలకొల్పడమే తన కర్తవ్యమని ఆయన భావించాడు." సతీష్ చంద్ర చక్రవర్తి- బ్రహ్మసమాజ బోధకులలో ప్రసిద్ధుడు. ఆయన 1933 సెప్టెంబర్ 27 నాడు చేసిన బోధలో ఇలా పేర్కొన్నాడు: "తన సమాజం - కొత్త మతానికి దేవాలయంగా ఉండాలని రామమోహనుడు భావించలేదు. అది అన్ని తెగలవారూ ఒక్కగానొక్క భగవంతుణ్ణి ఉమ్మడిగా పూజించే సమైక్యతాకేంద్రంగా ఉండాలని ఆయన ఆశించాడు. హిందువులు, ముస్లిమ్‌లు, క్రైస్తవులు తమ మతాలను అనుసరిస్తూనే ఒక టిగా కలిసి పూజ చెయ్యవచ్చునన్న రామమోహనుడి విశ్వాసాన్నీ, దృష్టినీ మనం తరచు - సరిగా గ్రహించడంలేదు."

ఈ దేశంలోని ప్రముఖులు కొందరి అభిప్రాయాలను ఇలా మీద విస్తృతంగా పేర్కొనడంలో నా ఉద్దేశం - బ్రహ్మసభనుంచి రూపొందిన బ్రహ్మసమాజం రామమోహనుడి ఆలోచనలలోగానీ, ప్రయత్నాలవల్ల గానీ రూపొందిందికాదని స్పష్టంగా చెప్పడమే.

ప్రసన్నకుమార్ ఠాగూరు అనే ఆయన 'ది రిఫార్మర్' అనే పత్రికను నడిపేవాడు. 1831 నాటి 'రిఫార్మర్'లో వెలువడిన భాగం ఇది: "వేదాంత సంస్థ అయిన బ్రహ్మసభ 1828 లో నెలకొల్పబడింది. మేధావిగా ప్రసిద్ధుడైన మన దేశస్థుడు బాబూ రామమోహన్‌రాయ్ బుద్ధిమంతులైన మరికొందరు హిందువులతో కలసి దాన్ని నెలకొల్పాడు....చిత్పూరు రోడ్డులోని ఒక ప్రసిద్ధగృహంలో ప్రతి శనివారం సాయంకాలమూ బ్రహ్మసభ సమావేశాలు సాగుతుంటాయి. అక్కడ సమావేశమయ్యేవారు వేదాంత బోధలూ వింటూ, అసలైన ఒక్క భగవంతుణ్ణి గురించిన ప్రార్థనాగీతాలు పాడుతూ తమ సమయాన్ని వినియోగిస్తారు....ఈ ఆవరణలో సాగే కార్యక్రమాలలో పాల్గొనడానికి క్రైస్తవులనూ, ఇతర మతాలవారినీ కూడా అనుమతిస్తున్నారు."

'తత్త్వబోధినీ పత్రిక' (మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు స్థాపించిన పత్రిక) 1847 అక్టోబర్ సంచికలో ప్రచురితమైనది ఇది: "కొన్ని సందర్భాలలో ఇక్కడ ముస్లిం అబ్బాయిలు, క్రైస్తవ బాలురూ భగవం

తుణ్ణి ప్రసంసిస్తూ పారశీక భాషలోనూ, ఆంగ్లంలోనూ గీతాలు పాడేవారు.''
అదే పత్రిక 1854 సంచికలో మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు శిష్యుడూ, ప్రముఖ రచయిత అయిన అక్షయకుమార్ దత్ ఇలా వ్రాశాడు: ''ఆయన (రామమోహనుడి) కాలంలో బ్రహ్మసమాజపు ఆచార్యులు ఉపనిషత్తుల నుంచీ, సంస్కృత శాస్త్రాలనుంచీ శ్లోకాలనూ చదివి, వాటిని వివరించి భగవంతుడి పూజ జరిపేవారు. అలాగే హిందువులేగాక ఇతర దేశస్థులు కూడా బ్రహ్మసమాజానికి వచ్చి అక్కడ తమతమ భాషలలో భగవంతుణ్ణి ప్రశంసిస్తూ ప్రార్థన చేసేవారు.''

తర్వాతి రోజుల్లో బ్రహ్మసమాజంగా పిలువబడిన బ్రహ్మసభను ఒక ప్రత్యేకవర్గంవారి మత వ్యవస్థగా ఉండనివ్వదలచుకుని ఉంటే, ఇతర మతస్థులు అక్కడికివచ్చి దాన్ని తమ ఆరాధనాప్రదేశంగా ఉపయోగించుకుని ఉండేవారు కారని స్పష్టమవుతుంది.

రామమోహనుడు భారతదేశంనుంచి వెళ్ళాక, బ్రహ్మసభ నిర్వాహకులు దాన్ని బ్రహ్మసమాజం అని పిలువసాగారు. రామమోహనుడు తాను వ్రాసిన భక్తిగీతం ఒకదాన్ని 1830 లో తాను నెలకొల్పిన ఏకేశ్వరోపాసక సమావేశస్థలంలో పాడడంకోసమని ఇంగ్లాండునుంచి కలకత్తాలోని తన కొడుక్కు పంపించాడు. ఆ ఉత్తరంలో ఆయన మొదట బ్రహ్మసభ అని పేర్కొన్నాడు. తర్వాత దాన్ని బ్రహ్మసమాజంగా పేర్కొన్నాడు. 'సమాజం' అనే మాట ఇక్కడ ఒక తెగవారి బృందం అనే .ర్థంలోగాక, ప్రజల సంఘం అనే అర్థంలో వాడబడిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. 'సమాజం' అనే మాట ఇప్పటికీ ఆ అర్థంలోనే వాడబడుతున్నది.

బ్రహ్మసభ అనే ఈ ఆస్తికసంస్థ దాదాపు పదిహేనేళ్ళపాటు వేదాంత సిద్ధాంతాలను బోధించింది. అప్పట్లో బ్రహ్మమతం అంటూ విడిగా మత మేదీలేదు. మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు కొందరు పండితుల సాయంతో ఉపనిషత్తులనుంచీ, శాస్త్రాలనుంచీ సేకరించిన అంశాలతో ఒక సంకలనం రూపొందించాడు. అలా 1841 లో బ్రహ్మమతానికి సంబంధించిన మొదటి పుస్తకం వెలువడింది. ఆ ఏడాదే తత్త్వబోధినీ సభలో జరిగిన సమా

వేశంలో వేదాంతంమీద ఆధారపడిన మతం - బ్రహ్మధర్మంగా మార్చబడి, ఒక నియమం రూపొందింపబడింది. అలా రామమోహనుడు మరణించిన తర్వాత ఎంతకాలానికో బ్రహ్మమతం, బ్రహ్మమత సభ (Brahmo Church) వ్యాప్తిలోకి వచ్చాయి.

1879 లో ప్రచురింపబడిన 'బ్రహ్మసమాజ చరిత్ర - దాని పుట్టుక నుంచి ఈ రోజువరకు'(A History of the Brahmo Samaj-From its Rise to the Present Day) అనే తన గ్రంథంలో జి ఎస్. లియొనార్డ్ "నేను వేదాంతమతాన్ని అనుసరిస్తాను" అని వ్రాశాడు. 'వేదాంత మతం' అనే పదబంధం తర్వాత 1768 పౌష్యమాసం 11 వ తేదీ (క్రీ.శ. 1846) నాడు తత్త్వబోధినీ సభలో జరిగిన సమావేశంలో 'బ్రహ్మధర్మం'గా మార్చబడింది. ఆ మార్పును రాజనారాయణబోసు సూచించాడు; అక్షయకుమార్ దత్ దాన్ని బలపరిచాడు.

1841 ముందు బ్రహ్మమతంగానీ, బ్రహ్మమత వ్యవహారాలకు సంబంధించిన నియమాలుకానీ లేవు. బ్రహ్మసమాజ వ్యవహారాల నియమాల ప్రకారం, మొదటి బ్రహ్మవివాహం 1861 జూలై 26 నాడు జరిగింది.

అన్ని జాతులవారికి సంబంధించిన ఏకేశ్వరోపాసకుల విశ్వజనీనమైన సమావేశకేంద్రంగా ఉండాలన్న విశాలదృష్టితో రామమోహన్‌రాయ్ బ్రహ్మసభను స్థాపించాడు. ఆయన భారతదేశతీరాన్ని విడిచిపెట్టగానే - ఆయన విశాలదృష్టి కరిగిపోయింది. ఆయన మరణంతో ఆ దృష్టి పూర్తిగా చెదిరిపోయింది. ఆ స్థానాన్ని హిందూ ఏకేశ్వరోపాసకుల సమావేశకేంద్రమైన బ్రహ్మసమాజం ఆక్రమించింది. రామమోహనుడి దృక్పథాన్ని ఇలా సంకుచితం చెయ్యడానికి చరిత్రాత్మకమైన సంఘటనలూ, ఆ కాలపు చరిత్రాత్మకమైన అవసరమూ కారణాలు కావచ్చు. ఏది ఏమైనా, రామమోహనుడి విశ్వజనీన దృక్పథం సంకుచితం చెయ్యబడి, 'బ్రహ్మోలు'గా పిలువబడే హిందూ ఏకేశ్వరోపాసకులకు మాత్రం పరిమితమైన మత వ్యవస్థ రూపొందింది. ఈ కొత్త ధోరణిని రూపొందించడంలో మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు ప్రముఖపాత్ర వహించాడు.

# ఇంగ్లండులో రామమోహనుడు

1830 నవంబర్ 15 నాడు రామమోహన్‌రాయ్ 'ఆల్బియన్' అనే ఓడలో ఇంగ్లండుకు బయలుదేరి, 1831 ఏప్రిల్ 8 నాడు అక్కడికి చేరాడు. రామమోహనుడి కీర్తి ఆయనకన్నా ముందుగానే పయనించింది. 1816 లో వేదాంతం గురించిన ఆయన తొలి ఆంగ్లరచన అయిన 'వేదాంత సంగ్రహం' (An Abridgment of Vedant) వెలువడినప్పుడు ఇంగ్లండుకు చెందిన 'ది మంత్లీ రిపాసిటరీ ఆఫ్ థియాలజీ అండ్ జనరల్ లిటరేచర్' (The Monthly Repository of Theology and General Literature) దాన్ని సమగ్రంగా విమర్శించింది. లివర్‌పూల్‌కు ఆయన వచ్చిన వార్త తెలియగానే ఆ పట్టణ ప్రముఖులు చాలా మంది ఆయనను చూడడానికి వచ్చారు. మెడిసిన్‌కు చెందిన విలియం రాస్కో అనే ప్రముఖ చరిత్రకారుడు అప్పుడు బాగా అనారోగ్యంగా ఉన్నాడు. ఆయన తనను కలుసుకోవలసిందిగా తన కొడుకు ద్వారా రామమోహనుడికి వార్త పంపించాడు. రామమోహనుడు అనారోగ్యంతో బాధపడుతున్న రాస్కోను కలుసుకున్నాడు. వాళ్ళిద్దరూ సన్నిహితంగా సంభాషించుకున్నారు. ఆ గోష్ఠి సాగుతున్నప్పుడు అక్కడే ఉన్న రాస్కో కొడుకు దాన్ని గురించి వ్రాసిన చిరస్మరణీయమైన వ్రాత ఇది: "ఈ గోష్ఠి ఎన్నటికీ మరపురానిది ...ప్రాచ్యదేశాల సంప్రదాయం ప్రకారం నమస్కరించిన రామమోహనుడు 'నాకు సంతోషంగానూ, గర్వంగానూ ఉంది. యూరపులోనేకాక, ప్రపంచం మొత్తంమీదా ప్రసిద్ధుడైన వ్యక్తిని చూడడంవల్ల నాకు ఎంతో సంతోషంగానూ, గర్వంగానూ ఉంది' అన్నాడు. 'ఈ దినం చూడడంకోసం నన్ను బతకనిచ్చిన దేవుడికి నా అభినందనలు' అన్నాడు రాస్కో." ఏళ్ళతరబడి పక్షవాతంతో అవస్థపడుతున్న రాస్కో ఆ తర్వాత కొన్నాళ్ళకు మరణించాడు.

రామమోహనుడి ఇంగ్లండు ప్రయాణానికి మూడు కారణాలు ఉన్నాయి. వాటిలో మొదటిది - అప్పటి ఢిల్లీ చక్రవర్తి అయిన రెండవ అక్బర్ తరఫున ఇంగ్లండు రాజుకు ఒక విజ్ఞాపనను సమర్పించడం. రెండవది - సతిని నిషేధించమని హవుస్ ఆఫ్ కామన్స్ [ప్రజాప్రతినిధుల సభ]కు ఒక విజ్ఞాపనను సమర్పించడం. మూడవది - ఈస్ట్ ఇండియా కంపెనీ శాసనం పునరంగీకారం గురించి హవుస్ ఆఫ్ కామన్స్‌లో సాగే చర్చ సందర్భంగా అక్కడ హాజరుకావడం. సంస్కరణ బిల్లు రెండవ పఠనం (second reading) సమయానికి హవుస్ ఆఫ్ కామన్స్‌లో హాజరుకావడం కోసం రామమోహనుడు లివర్‌పూల్‌నుంచి ఏమాత్రమూ ఆలస్యం చెయ్యక లండన్ చేరుకున్నాడు. ఆయన లండన్ చేరేసరికి చీకటి పడుతున్నది. బాగా అలసిపోయి ఉండడంతో ఆయన నిద్రపోసాగాడు. అప్పుడు ప్రముఖ బ్రిటిష్ తత్త్వవేత్త జెరెమీ బెంతామ్ రామమోహనుణ్ణి చూడడానికి ఆయన బసచేసిన హోటలుకు వచ్చాడు. అయితే అప్పటికే రామమోహనుడు విశ్రాంతి తీసుకుంటున్నాడని తెలిసి, బెంతామ్ ఒక చీటీ వ్రాసిపెట్టి వెళ్ళిపోయాడు. ఆ చీటీలో 'జెరెమీ బెంతామ్‌నుంచి - స్నేహితుడు రామమోహన్‌రాయ్‌కి' అని వ్రాసి ఉంది, బెంతామ్ రామమోహనుణ్ణి ఎంతగానో ఆరాధించేవాడు. ఇంకొకసారి ఆయన రామమోనుడికి చీటీవ్రాసి ఉంచినపుడు రామమోహనుణ్ణి 'మిక్కిలిగా ఆరాధింపబడేవాడు, మానవజాతి సేవలో ప్రియమైన సహచరుడు'గా పేర్కొన్నాడు.

ఇంగ్లండుకు చేరగానే ఆయన ఢిల్లీ చక్రవర్తి విజ్ఞాపనను ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్ల సంఘానికీ, లండన్‌లో పలుకుబడిగల పెద్ద మనుషులు చాలామందికీ అందజేశాడు. ఆ విజ్ఞాపనలోని అంశాలను పూర్తిగా అంగీకరించకపోయినా 1833 ఫిబ్రవరి 13 న డైరక్టర్ల సంఘం అందులో కొన్నిటిని ఆమోదించింది. అలా అది ఢిల్లీ చక్రవర్తి వార్షిక ఉపకారవేతనాన్ని మూడులక్షల రూపాయలు పెంచింది.

లండన్‌లో రామమోహనుడు ఇంగ్లండులోని పెద్దమనుషులను కలుసుకుని వాళ్లతో రాజకీయచర్చ జరపడంలో తీవ్రంగా నిమగ్న

డయ్యాడు. ఇంగ్లండు రాజుకు సోదరుడైన కంబర్‌లాండ్ ప్రభువు (The Duke of Cumberland) ఆయనను హవుస్ ఆఫ్ లార్డ్స్ [ప్రభువుల సభ]కు పరిచయం చేశాడు. జేమ్స్ సతర్‌లాండ్ "రాజా వెనువెంటనే కలగజేసుకుని చేసిన ప్రార్ధనలు టోరీ (రాజపక్షం వారైన) ప్రభువులు భారతదేశపు జూరీ బిల్లుకు వ్యతిరేకంగా వోటు చెయ్యకుండా ఆపాయి" అని పేర్కొన్నాడు. రామమోహనుడు లార్డ్ బ్రవమ్ (Lord Brougham) తో సన్నిహిత స్నేహాన్ని పెంపొందించుకున్నాడు. లార్డ్ బ్రవమ్ బానిసత్వం నిర్మూలనకూ, ప్రజా విద్యావిధానాన్ని ప్రోత్సహించ డానికీ కృషిచేసేవాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ డైరక్టర్లు 1831 జూలై 6 నాడు రాత్రి రామమోహనుడికి 'సిటీ ఆఫ్ లండన్' ఆహారగృహంలో విందుచేశారు. ఆ విందుకు ఈస్ట్ ఇండియా కంపెనీ అధ్యక్షుడు అధ్యక్షత వహించాడు. రామమోహనుడు చిరకాలం ఆరోగ్యంగా వర్ధిల్లాలని ఆయన అభినందించాడు; రామమోహనుడు భారతజాతికి చేసిన గొప్ప సేవలను ఆయన ప్రశంసించాడు. నాలుగవ విలియం పట్టాభిషేకాన్ని చూడడానికి ఆయనకు యూరపు రాజుల రాయబారుల సరసన ఆసనం ఏర్పాటుచేశారు. రాయల్ ఆసియాటిక్ సొసైటీవారు ఆయనను తమ వార్షికసమావేశానికి ఆహ్వానించారు. అక్కడ ఆయన ప్రముఖ ప్రాచ్యవేత్త (Orientalist) అయిన హెన్రీ తామస్ కోల్‌బ్రూక్‌కు వందనసమర్పణ చేశాడు రామ మోహనుడు మానవతావాదియైన సోషలిస్టు రాబర్ట్ ఓవెన్‌నుకూడా కలుసు కున్నాడు. రాబర్ట్ ఓవన్ రామమోహనుడు తన దృక్పథాన్ని అంగీక రించాలని ఎంతగానో ప్రయత్నించాడు.

రామమోహనుడు ఇంగ్లండుకు చేరినప్పుడు సంస్కరణ బిల్లు ఉద్యమంవల్ల చెలరేగిన ఉద్యమం అక్కడి రాజకీయజీవితాన్ని గడగడ లాడిస్తున్నది. 1831 మార్చిలో ప్రవేశపెట్టబడిన మొదటి బిల్లు కమిటీ స్థాయిలోనే వీగిపోయింది. అది ఓడిపోవడంతో పార్లమెంటును రద్దుచేయ వలసి వచ్చింది. కొత్తగా ఎన్నికైన హవుస్ ఆఫ్ కామన్స్ రెండవ సంస్కరణ బిల్లును 1831 సెప్టెంబర్ 26 న ఆమోదించింది. కాని దాన్ని

హౌస్ ఆఫ్ లార్డ్స్ అక్టోబర్‌లో తోసిపుచ్చింది. మూడవ సంస్కరణ బిల్లును హౌస్ ఆఫ్ కామన్స్‌లో మళ్లీ ప్రవేశపెట్టారు. 1832 మార్చిలో ఆ బిల్లు ఆమోదింపబడింది. అప్పుడు దాన్ని హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు పంపారు. ఇంగ్లండు ప్రజలు ప్రభువుల నిర్ణయాన్ని 'విపరీతమైన ఆదుర్దా'తో ఎదురుచూస్తున్నారు ఈసారి ప్రజల ఒత్తిడికి ప్రభువులు లొంగారు. వారు 1832 జూన్‌లో సంస్కరణ బిల్లును ఆమోదించారు. ఐర్లండ్, స్కాట్లండ్‌లకు కూడా అటువంటి నిర్ణయాలే అనుసరించారు. రామమోహనుడికి సంస్కరణ బిల్లు ఆమోదింపబడడం ఎంతో ఆనందం కలిగించింది. ఆ ఆనందాన్ని ఆయన విలియం రాత్‌బోన్‌కు వ్రాసిన ఉత్తరంలో వ్యక్తంచేశాడు. అందులోని కొన్ని భాగాలు మనకు ఇంతకు ముందే పరిచితమైనవి.

రామమోహనుడికి ఫ్రాన్స్‌దేశంపట్ల ఎంతో అభిమానం ఉండేది. స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం - అనే మూడిటికోసమూ ఉత్తేజకరమైన ఘోషచేసిన ఫ్రాన్స్ ఆయన మాటలలోనే చెప్పాలంటే - అది 'కళలను, విజ్ఞానశాస్త్రాలను పెంపొందిచడంవల్ల సుసంపన్నమైనది; స్వతంత్రమైన సంవిధానాన్ని కలిగిఉండే భాగ్యం గలది.' ఆయన పేరు ఫ్రాన్స్‌లోని సాంస్కృతిక వర్గాలలో సుపరిచితమైనదే. 1818 నాటికే ఆయన రచనలు ఫ్రాన్సుతీరాన్ని చేరడమే అందుకు కారణం. 'కలకత్తా టైమ్స్' పత్రికా సంపాదకుడైన డి అకోస్టా (D Acosta) - బ్లాయిస్‌కు బిషప్ (Bishop of Blois) అబ్బె గ్రెగాయిర్ (Abbe Gregoire)కు రామమోహన్‌రాయ్ వ్రాసిన తాత్త్వికా, మతసంబంధమైన రచనలు కొన్ని పంపాడు. అబ్బె గ్రెగాయిర్ ద్వారా రామమోహనుడి పేరు ఫ్రాన్స్‌లోని బుద్ధిజీవుల మధ్య విస్తృతంగా వ్యాపించింది. రామమోహనుడి గురించి ఒక పత్రంలో అబ్బె గ్రెగాయిర్ ఇలా వ్రాశాడు: "తన రచనలపట్ల చెలరేగే వ్యతిరేకతను ఎదుర్కోవడంలో ఆయన చూపే హిత, మితమైన ధోరణి; ఆయన వాదాలలోని తీక్ష్ణత, హిందువుల పవిత్రగ్రంథాల గురించిన ఆయన పాండిత్యం - ఇవన్నీ తాను తీసుకున్న పనిని నిర్వహించడానికి

ఆయన ఎంత సమర్థుడో వివరిస్తాయి; ఆయన డబ్బును లెక్కచెయ్యక ధనసంబంధమైన త్యాగాలు ఎన్నో చేశాడు. అయితే ఆ త్యాగాలలో కని పించే నిస్వార్థగుణాన్ని ప్రశంసించకుండా, మెచ్చుకోకుండా ఉండడం కష్టం."

"1824 జూన్ 7 నాటి సమావేశంలో సొసైటీ ఆసియాటిక్ (Societe Asiatique) వారు తమ సంఘానికి 'అసోసియేట్ కరెస్పాం డంట్స్'ను నియమించే విషయంగురించి చర్చించారు. మాన్షియర్ లె కామ్టె డి హాటెరిన్ (Monsieur Le Comte d' Hauterine), బేరన్ డి సాసి (Barron de Sacy) ఇద్దరూ పండిట్ రామమోహన్ రాయ్‌కి ఆ బిరుదును ఇవ్వాలని సూచించారు. ఆ సూచనను శ్రీయుతులు లాంజునాయిన్ (Lonjuinais), బర్నాఫ్ (Burnouf), క్లాప్రాత్ (Klaproth) లు సభ్యులుగా ఉన్న ఒక ఉపసంఘానికి అందజేశారు. 1824 జూలై 5 నాడు, క్లాప్రాత్ తమ ఉపసంఘం తరఫున పండిట్ రామ మోహన్‌రాయ్‌కి ఉన్న సాహిత్య బిరుదులనుగురించిన నివేదిక సమర్పిస్తూ, ఆయనను 'అసోసియేట్ కరస్పాండెంట్' చెయ్యవలసిందిగా సిఫార్సు చేశారు. ఈ నివేదికలోని తీర్మానాలను సంఘ సమావేశంలో చర్చించి, రామమోహన్‌రాయ్‌కి 'అసోసియేట్ కరస్పాండెంట్' బిరుదు ఇచ్చారు." ['ఇండియా అండ్ ది వర్ల్డ్' 1933 డిసెంబర్ సంచికలో మేడమ్ మోరిన్ వ్రాసిన వ్యాసం].

ఉద్యోగ విరమణచేసిన ఆంగ్లేయ అధికారి అయిన లాక్లాన్ (Lachlan) అనే ఆయనను సొసైటీ ఆసియాటిక్‌వారు తాము రామ మోహనుడికి ఇచ్చిన గౌరవ సభ్యత్వపత్రాన్ని రామమోహనుడికి వ్యక్తి గతంగా అందజెయ్యమని నియమించారు. 1924 నాటి 'రెవ్యూ ఎన్‌సైక్లో పీడిక్' [Revue Encyclo peidique (Paris)] లో వ్రాసిన ఒక వ్యాసంలో సిస్మాండి (Sismondi) రామమోహనుడి గురించి వ్రాస్తూ "భారతదేశాన్ని గురించి తెలిసినవారు ఆ బ్రాహ్మణుణ్ణి గొప్ప సౌశీల్యం

కలవాడనీ, మేధావి అనీ పేర్కొనడానికి అంగీకరిస్తారు. రామమోహన్ రాయ్ తన దేశప్రజలను మళ్ళీ ఏకేశ్వరోపాసనను స్వీకరించేలా చెయ్యడానికీ, నైతికనిష్ఠను మతంతో కలగలపడానికీ కృషి చేస్తున్నాడు," అన్నాడు.

1832 అక్టోబర్ 14 నాడు రామమోహన్‌రాయ్ ఫ్రాన్స్ రాజును కలుసుకున్నాడు. 1832 డిసెంబర్‌లో మాన్షియర్ పాతియెర్ (Monsieur Pauthier) వ్రాసిన ఒక వ్యాసం పారిస్‌లో వెలువడింది. ఆ వ్యాసం రామమోహనుడి రచనలలోని వివిధ అంశాలగురించీ విస్తృతంగా చర్చించింది.

కాలక్రమాన బ్రిటిష్ ప్రభుత్వం ఢిల్లీ చక్రవర్తి తరఫున రామమోహనుడు ప్రాతినిధ్యం వహించడానికిగల హక్కును గుర్తించింది; అలాగా ఢిల్లీ చక్రవర్తి రామమోహనుడికి ఇచ్చిన 'రాజా' అనే బిరుదును కూడా ప్రభుత్వం గుర్తించింది. 1831 సెప్టెంబర్ 7 నాడు సెంట్‌జేమ్స్ పాలస్‌లో ఏర్పాటుచేసిన ఒక రాజసభలో నాలుగవ విలియం రాజు-రామమోహనుణ్ణి కలుసుకున్నాడు. ఆ తర్వాత, విలియం రాజు - లండన్ బ్రిడ్జి ప్రారంభోత్సవ సందర్భంగా ఏర్పాటుచేసిన విందుకు రామమోహనుణ్ణి ఆహ్వానించాడు. ఆంగ్ల సంఘంలోని ఉన్నతవర్గాలకు చెందినవారు రామమోహనుణ్ణి తమలో ఒకడుగా అంగీకరించారు, ఆయన గౌరవార్థం లండన్‌లో ఎందరో సభలు ఏర్పాటుచేశారు. అందులో జెరెమీ బెంతామ్ వంటి ప్రముఖులు పాల్గొనేవారు. బ్రిటిష్ ఏకేశ్వరోపాసకుల సంఘం ఆయన గౌరవార్థం ఒక సభ ఏర్పాటుచేసింది. ఆ సభలో జెరెమీ బెంతామ్ జీవిత చరిత్ర వ్రాసిన డాక్టర్ బౌరింగ్ రామమోహనుడికి స్వాగతం చెప్పాడు. అప్పుడు ఆయన ఇలా చెప్పాడు: "ఆయన ఇక్కడికి రావడం ద్వారా మా హృదయాలలో కలిగిన ఆసక్తికీ, నిరీక్షణకూ సంబంధించిన అనుభూతులను మాటలలో చెప్పడం అసాధ్యం. కొందరు రచయితలు తమ్ముతాము ఒక ప్రశ్న వేసుకున్నారు. తమ కీర్తిద్వారా తమ కాలం తర్వాత కూడా జీవిస్తున్న మహాపురుషులు మళ్ళీ తమ మధ్య ప్రత్యక్ష

మైతే ఎలా ఉంటుందో అనుకున్నారు వాళ్ళు. ప్లేటోగాని, సోక్రటీసుగాని, మిల్టన్‌గాని, న్యూటన్‌గాని - తమముందు ప్రత్యక్షమై తమను అలా మన్నిస్తే - తమ అనుభూతి ఎలా ఉంటుందో ఊహించడానికి వాళ్ళు ప్రయత్నించారు. రాజా రామమోహన్‌రాయ్ అనే పేరు చెప్పి, మీకు స్వాగతం పలకవలసివచ్చినప్పుడు - నేనుకూడా ఆ రచయితలు పొందిన అనుభూతిని పొందాను. ఆ అనుభూతిలో నేను మునిగిపోయాను. నా మనసులో దూరం ప్రభావంకూడా-కాలపు ప్రభావంలాగానే కనిపిస్తున్నది. వేలకొద్ది సంవత్సరాలముందు జీవించిన ఆ మహాపురుషులపట్ల చూపే ఆసక్తితోనే వేలకొద్ది మైళ్ళ దూరంనుంచి వచ్చిన ఈయనపట్ల కూడా చూపవలసి ఉంది.''

ఈ సభలో అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయం మాజీ అధ్యక్షుడైన డాక్టర్ కిర్క్‌లాండ్ (Dr. Kirkland) పాల్గొన్నాడు. ఆ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, "అమెరికాలో రాజాపట్ల ఎంతో ఆసక్తి చూపిస్తున్నారు; ఆయన రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్నారు'' అన్నాడు. రెవెరెండ్ డబ్ల్యూ. జి ఫాక్స్ కూడా రామ మోహన్‌రాయ్‌ని గొప్పగా ప్రశంసించాడు. రామమోహన్‌రాయ్ తనకు జరిగిన ఈ సన్మానాలకు సమాధానం చెబుతూ ఉపన్యసించాడు. ఈ ఉపన్యాసంలోని చిరస్మరణీయమైన చివరిమాటలు ఇవి: "వివేకానికీ శాస్త్రాలకూ, లౌకిక పరిజ్ఞానానికీ సంపదకూ, అధికారానికీ పక్షపాత ధోరణికీ మధ్య పోరాటం సాగుతున్నది. ఈ మూడూ తక్కిన మూడిటితో యుద్ధం సాగిస్తున్నాయి; అయితే మీ విజయం ఎప్పుడో ఒకప్పుడు తప్పనిసరిగా సాధ్యంకాగలదని నేను నమ్ముతున్నాను....నన్ను అడుగడుగునా గౌరవించి మీరు నాకు చేసిన సన్మానాన్ని నేను నా జీవితంలో తుదిక్షణందాకా మరచి పోలేను.''

ఆర్థిక సమస్యలు, అలవికాని పనుల ఒత్తిడికలిసి-రామమోహనుడి ఆరోగ్యంమీద దెబ్బతీశాయి. మామూలుగా ఆయన ఆరోగ్యం బాగుండేది. ఆయన ఆర్థికసమస్యలకు - ఆయన కలకత్తా ప్రతినిధులైన మెకింతోష్

అండ్ కంపెనీవారి బాంకింగ్ హవుస్, ఆయన లండన్ ప్రతినిధులైన రికర్డ్స్ మెకింతోష్ అండ్ కంపెనీ - విఫలంకావడమే కారణం. 1833 సెప్టెంబర్ ప్రారంభంలో మిత్రులు ఆయనను లండన్‌నుంచి బ్రిస్టల్‌కు వెళ్ళమని ఒత్తిడి చేశారు. అలా వెడితే కొంత మార్పుగా ఉండడంతో బాటు, ఆయనకు విశ్రాంతి చిక్కగలదని వాళ్ళు అనుకున్నారు. అలా రామమోహనుడు తన స్నేహితుడు, బ్రిస్టల్‌లోని లూయిన్'స్ మీడ్ చాపెల్‌లో బోధకుడు (Pastor of Bristols Lewin's Mead Chapel) అయినడాక్టర్ లంట్ కార్పెంటర్ (Dr. Lant Carpenter) శిష్యురాలైన కుమారి కాసిల్ (Miss Castle) ఇంటికివెళ్ళి విశ్రమించసాగాడు. స్నేహితుల సాంగత్యంలో రామమోహనుడు తన ఇబ్బందులను చాలా వరకు మరచిపోగలిగాడు. అయితే సెప్టెంబర్ 19 నాడు ఆయనకు అకస్మాత్తుగా జబ్బు చేసింది. ఆయనకు విపరీతమైన జ్వరమూ, భరించరాని తలనొప్పి వచ్చాయి. ఆ తర్వాతిరోజుల్లో ఆయన పరిస్థితి దిగజారసాగింది. ఆయన అనారోగ్యంతో ఇబ్బందిపడుతున్నప్పుడు డేవిడ్ హేర్ సోదరియైన కుమారి హేర్ ఆయనకు శుశ్రూష చేసింది. ప్రముఖ వైద్యులెందరో ఆయనకు వైద్యం చేశారు. కాని అందువల్ల ఫలితమేమీ లేకపోయింది. ఆయన పరిస్థితి ఎప్పటికప్పుడు దిగజారిపోయింది. 1833 సెప్టెంబర్ 27 నాడు రామమోహనుడు మరణించాడు.

రామమోహనుడికి వైద్యంచేసిన డాక్టర్ ఎస్ట్లిన్ ఆ చివరి గంటల గురించి ఇలా వ్రాశాడు: "అది - సొగసైన వెన్నెలరాత్రి. కిటికీ పక్కనున్న శ్రీ హేర్, కుమారి కిండెల్, నేను - కిటికీ వెలుపలికి చూస్తే నిశ్శబ్దమైన నిశిరాత్రి గ్రామీణ దృశ్యం, ఇటుపక్కచూస్తే మరణిస్తున్న ఆ మహాపురుషుడు. నేను ఆ క్షణాన్ని ఎప్పటికీ మరచిపోలేను. అప్పటిదాకా రాజాకు సపర్యలుచేసిన కుమారి హేర్‌కు మరణావస్థలో ఉన్న ఆయనదగ్గరికి వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. ఆయనను అనునయించడానికీ, ఆయనకు ఆహారం ఇవ్వడానికీ ఆయనదగ్గరే ఉండిన ఆమెను నిరాశ ఆవహించింది; ఆమె బాగా అలసిపోయింది. ఆ పక్కనే ఉన్న

కుర్చీలో కూలబడి ఏడవసాగింది ఆమె....రెండున్నర గంటల వేళప్పుడు శ్రీ హేర్ నా గదిలోకివచ్చి అంతా అయిపోయిందన్నాడు. రామమోహనుడు 2-25 గంటలకు చివరిశ్వాస తీశాడు.'' కుమారి కలెక్ట్ ఇలా పేర్కొన్నది: ''ఆయన ఉచ్చరించగా విన్న చివరి పలుకులు - 'ఓం'అనే పవిత్ర మంత్రమే. దాన్నిబట్టి ఏకాంతమైన మరణద్వారంవద్ద ఉన్నా, క్రిక్కిరిసిన జీవితమార్గంమీద ఉన్నాకూడా దైవచింతనే ఆయన ఆత్మకు ప్రధాన కర్తవ్యంగా ఉండేదని తెలియవచ్చింది.''

1833 అక్టోబర్ 18 వ తేదీనాడు మధ్యాహ్నం రెండు గంటలప్పుడు స్టేపుల్‌టన్‌గ్రోవ్‌లో ఆయన శరీరాన్ని పూడ్చిపెట్టారు. అప్పుడు అక్కడ ఉన్న మేరీ కార్పెంటర్ ఆ సంఘటనను ఇలా వివరించింది: ''అన్ని ఏర్పాట్లూ పూర్తిగా చెయ్యబడ్డాయి. హేర్ కుటుంబంవారు లండన్‌నుంచి వచ్చారు. రాజాతో వ్యక్తిగత సంబంధంగలవారిని మాత్రమే స్టేపుల్‌టన్ గ్రోవ్‌కు ఆహ్వానించారు. కుమారి కాసిల్ సంరక్షకుడు, వారి సన్నిహితులు, హేర్ కుటుంబంవారు, రామమోనుడికి ఆయన కుమార్తెలా సపర్యలుచేసిన కుమారి హేర్, రామమోహనుడి దత్తపుత్రుడైన బాలుడు రాజారామ్, బ్రాహ్మణ సేవకులు అక్కడికి వచ్చారు. డాక్టర్ ఎస్టిన్ - తన తల్లినీ, పసిపిల్ల అయిన తన కుమార్తెనూ తీసుకునివచ్చాడు. తక్కిన వైద్యబృందం, డాక్టర్ జెరార్డ్, ప్రముఖుడైన జాన్‌ఫాస్టర్, మా నాన్న, నేను అక్కడ చేరాము. మిట్టమధ్యాహ్నం అయ్యాక ఆ పవిత్రపురుషుడి శరీర అవశేషాలున్న పేటిక నెమ్మదిగా, గంభీరంగా విశాలమైన కంకర బాటవెంబడి మోసుకుపోబడింది. ఆ గాఢమైన నిశ్శబ్ద వాతావరణంలో, ఆయన మరణానికి సంతాపంపొందిన మిత్రులు ఆ పేటికను అనుసరించారు. వారికి ఆయనతో అంతకు కొంతకాలంముందే పరిచయం ఏర్పడింది. ఆ పేటికను మోస్తున్నవారు నీడకమ్మిన దారివెంబడి సాగిపోయారు. ఆ దారి అంతకుముందు ఎన్నిసార్లో రామమోహనుడు నడచిన దారే. పేటికను ఆ దారివెంబడి తీసుకువెళ్ళి, నిర్ణీతమైన ప్రదేశాన, ఆ పవిత్రమైన బరువును దించారు. తమ గుండెలలో నిండిన గాఢమైన అభిప్రాయాలను

వెల్లడించడానికి అక్కడున్న ఎవరికీ గొంతు పెగలలేదు. జాన్ ఫాస్టర్ 'అటువంటి సమాధి సమీపాన ఎవరు మాట్లాడి ఉండగలరు ?' అన్నాడు."

ఎన్నో సంవత్సరాల తర్వాత 1842 రామమోహన్‌రాయ్ స్నేహితుడు, శిష్యుడు అయిన ద్వారకానాథ్ ఠాగూరు ఇంగ్లండుకు వెళ్ళాడు. ఆయన రామమోహనుడి శరీరాన్ని ఉంచిన పేటికను స్టేపిల్‌టన్ గ్రోవ్ నుండి బ్రిస్టల్ నగరం పొలిమేరలలో ఉన్న ఆర్నో'స్ వేల్ శ్మశానానికి (Arno's Vale) తరలించాడు; అక్కడ 1843 మే 29 నాడు రామమోహనుడి భౌతికశరీరపు అవశేషాలను పాతిపెట్టించాడు. 1844 లో అక్కడే భారతీయ వాస్తు శిల్పవిధానంలో ఒక అందమైన కట్టడం నిర్మించబడింది.

## రామమోహనుడి ప్రభావం

రామమోహన్‌రాయ్‌ని అభిమానించిన విదేశీయులమీద ఆయన ప్రభావం ఎంతగా ఉన్నదన్న విషయం ఆయన జీవిత చరిత్రను ఆంగ్లంలో వ్రాసిన సోఫీ డాబ్సన్ కొలెట్ (Sophie Dobson Collet) వ్రాత చక్కగా వివరించగలదు.

"భారతదేశం అనాదియైన తన భూతకాలంనుంచి విస్తృతమైన భవిష్యత్తులోకి పయనించడానికి పనికివచ్చిన సజీవమైన వంతెనగా రామమోహనుడు చరిత్రలో నిలుస్తాడు. ప్రాచీనమైన కులతత్త్వానికీ ఆధునిక మానవతావాదానికీ, మూఢవిశ్వాసాలకూ, విజ్ఞానశాస్త్రానికీ, నిశ్చలమైన సంప్రదాయానికీ, సాంప్రదాయికమైన పురోగతికీ, అనేక దేవతోపాసనకూ, ఏకేశ్వరోపాసనకూ మధ్యగల అగాధాన్ని పూరించిన వంగిన ధనుస్సు ఆయన. తరతరాల సంప్రదాయానికీ, తప్పనిసరి అయిన జ్ఞానాభివృద్ధికీ సంబంధించిన పరస్పరవిరుద్ధమైన అభిప్రాయాలకు ఆయన తన వ్యక్తిత్వంలో పొసగేటట్టు చేశాడు. తరచుగా, తాను ఒంటరిగా వాటిగురించి బాధపడడం

ద్వారా ఆయన తన ప్రజలకు మధ్యవర్తిగా ప్రవర్తించాడు. జాతులు, మతాలు, నాగరకతలు మొదలైనవి బలవంతంగా కలవడంవల్ల ఏర్పడే కొత్త చైతన్యం ఆయనలో మూర్తీభవించింది. ఆ కలయికయొక్క పరిశోధనాస్వాతంత్ర్యం, విజ్ఞాన పిపాస, మానవతతో కూడిన విశాలమైన సానుభూతి, దాని స్వచ్ఛమైన నైతికవిధానాలు మొదలైనవి ఆయనలో మూర్తీభవించాయి. అంతేకాదు. ఆ కలయిక గత కాలాన్ని విమర్శిస్తూనే దానిపట్ల చూపిన గౌరవభావం, అది విప్లవంపట్ల చూపిన తెలివైన అనాదరణకూడా ఆయనలో మూర్తీభవించాయి. రామమోహనుడి జీవితంలో మనకు ఒక విషయం కనిపిస్తుంది. అది భారతదేశ పురోగతిలో మనకు ఇప్పటిదాకా కనిపించిందే. అది - ఆ ఉద్యమం రహస్యం - మత సంబంధమైనది కావడమే. తన సంచారాలన్నిటిలోనూ రామమోహనుడు తన మతంద్వారా రక్షింపబడ్డాడు...,ఆయన ప్రాచీనమైన హిందూ మూల వృక్షంనుంచి మొలకెత్తిన అచ్ఛమైన మొలక. ఆ మొలకపుట్టిన నేల - కొత్త ప్రభావాలవల్ల తడిసినా, బలవంతపెట్టే అపూర్వమైన శక్తితో నిండిన వాతావరణంతో నిండినా ఆ మొలకమాత్రం ఆ పాత చెట్టునుంచి పుట్టిన మొలకగానే ఉండిపోయింది. రాజా - పాశ్చాత్యధోరణికి మారిన ప్రాచ్యదేశీయుడు కాడు. యూరోపియన్‌గా కనిపించడానికి సందేహాస్పదమైన స్వరూపంధరించిన హిందువుడు కాదు. ఆ కొద్దిపాటి ఆయన - ఇక్కడ కొద్దిపాటి అనే మాటను ఆక్షేపణకరమైన ధోరణితో వాడని పక్షంలో—ఆస్తికుడైన యురేషియన్. ఆయన పురోగమించిన సరైన మార్గాన్ని మనం అనుసరించగలిగితే మనకొక విషయం స్పష్టమవుతుంది. ఆయన ప్రాచీనమైన ప్రాచ్యసంప్రదాయంనుంచి పాశ్చాత్య సంస్కృతికి కాక, పాశ్చాత్య సంస్కృతిద్వారా ఒక నాగరకతవైపుగా పయనించాడు; ఆ నాగరకత - పాశ్చాత్యమూ కాదు; ప్రాచ్యమూకాదు. ఆ నాగరికత ఆ రెండిటికన్నా విశాలమైనది; ఉన్నతమైనది. మొత్తంమీద ఆయన ఎడతెరిపిలేకుండా సాగిపోయే అవిచ్ఛిన్నతను రక్షిస్తాడు అలా రక్షించడానికి తన మతాన్ని ఆసరా చేసుకున్నాడు. అదే ఆయన అభ్యుదయ

ఉద్యమానికి చోదకశక్తిని సమకూర్చింది. కలగలపడానికీ, కట్టుబరచ డానికీ, విస్తృతం చెయ్యడానికీ, ప్రేరేపించడానికి పనికివచ్చిన శక్తి కూడా మతమే.

"అలా నవభారతదేశానికి ఆయన చక్కని ఉదాహరణ; దానికి ఆయన మార్గదర్శి అది ప్రబోధాత్మకంగానూ, ప్రభావాత్మకంగానూ కూడా పరిశీలించడానికి ఆయన తగినవాడు. బ్రిటిష్ రాజరికపు పరిపాలన ఉరవడిలో మనమీద ఆధారపడిన ఈ గొప్ప ప్రాచ్యదేశం ఏం కానున్న దన్న అమూల్యమైన సూచికను ఆయన పాశ్చాత్యదేశాల కొత్త ప్రజా స్వామ్యానికి అందజేస్తున్నాడు. భారతదేశానికి ఎటువంటి భవిష్యత్తు రామమోహనరాయ్ జీవితంమీదా, ఆయన కార్యకలాపాలమీదా చాలా వరకు ఆధారపడి రూపొందుతుందని చెప్పడానికి ఏమాత్రమూ సంశయించ నక్కరలేదు. ఒక్క భారతదేశ భవిష్యత్తేకాదు. మనం ప్రాచ్య, పాశ్చా త్యాలు ఇదివరకెన్నడూలేని తీరులో కలిసిపోతున్న తరుణంలో ఉన్నాము. మానవపురోగతిలో యూరోపియన్, ఆసియా ప్రవాహాలు ఇదివరలో తరచుగా కొద్దికొద్దిగా కలిసేవి. ఇప్పుడు అవి ఒక సంగమంపైపుగా పయనిస్తున్నాయి. అవి కలసిపోయి మానవజాతి పురోగతియొక్క సమ్మేళనాప్రవాహంగా రూపొందనున్నాయి అపరిమితమైన ఈ సంఘట నలు త్వరలో సిద్ధించేస్థితిలో ఉండడం-మనం చెప్పుకున్న జీవిత చరిత్రకు నాయకుడైన వ్యక్తిని మరింతగా ప్రాధాన్యంలోకి తెస్తుంది. ఆయన రానున్న మార్పులనుగురించి వివరించిన ప్రవక్త కాకున్నా, రానున్న మార్పులను సూచనాప్రాయంగా తెలియజేసిన జ్ఞాని."

భారతదేశపు ఆధునిక యుగంమీద ఆయనకుగల ప్రభావం ఎలాం టిదోనని రవీంద్రనాథ్ ఠాగూరు చెప్పిన ఈ మాటలే సాక్ష్యం చెబు తున్నాయి :

"తన దేశం తనను తాను మరచిపోయి, తన గొప్పతనాన్నే అను మానించే కాలంలో ఉన్నప్పుడు అవతరించే అపురూపమైన వ్యక్తిని అర్థం

చేసుకుని, ప్రశంసించడానికి కాస్త కాలం పడుతుంది. ఆయన గాత్రం శ్రుతికి విరుద్ధంగా బాధాకరంగా వినిపిస్తుంది. అందుకు ప్రజలు తమ వాయిద్యాల తీగెలను సడలించి, తాము ఉన్నతస్థాయిలో ఉన్నప్పుడు పలికించిన సత్యసంగీతానికి సరిపడేలా చెయ్యలేకపోవడమే కారణం.

"రామమోహన్‌రాయ్ సరిగా అలాంటి మనిషే. దేశంచేత ఆయన కఠినంగా తిరస్కరింపబడ్డాడు. దేశం తనకు సంక్రమించిన మహాసంపద గురించి జ్ఞాపకం చెయ్యడాన్ని సహించలేకపోయింది. కాని తన క్షీణదశ మీదమాత్రం వల్లమాలిన దురభిమానం పెంచుకుంది. పరిస్థితి అత్యవసరమైనది కావడంతో ఆ ఆగ్రహ వాతావరణంమధ్య ఆయన అవతరించడం తప్పనిసరి అయింది. సుదీర్ఘమైన క్షామదారిద్ర్యం తర్వాత - ఆ మాడిపోయిన ప్రదేశపు గుండెలో జీవితచైతన్యాన్ని వికసింపజేసే వర్షసంపదను తీసుకువచ్చే ఋతుపరిణామాన్ని సూచించడానికే ఆయన వచ్చాడు. అలా ఆ సన్నివేశమంతా మార్పుచెందడం దిగ్భ్రమతోకూడిన సంతోషాన్ని కలిగిస్తుంది. అది పూర్తిగా అర్థం కావాలంటే పంట బాగా పండేదాకా కాచుకోవాలి. అప్పుడిక దాన్ని ఒప్పుకోవడానికి పంటను కోసేవారు ఏమాత్రమూ వెనకాడరు. తన పరిసరాలకు అలవికాని పరిమాణంలో, అవాంఛితమైన ప్రమాదంలా బ్రహ్మాండంగా తన దేశప్రజలలోకి వచ్చాడు-రామమోహనుడు. కాని మన చరిత్ర రేయంతా ఎదురుచూసిన మనిషి ఆయనే. తన దేశపు ఆత్మ, కర్తవ్యాల సంపూర్ణమైన అర్థాన్ని తన జీవితంలో ప్రతిబింబించాడు ఆయన. ఆయనది ఒంటరి జీవితం. అయితే ఆయనకు సహచరులు లేకపోలేదు. ఆ సహచరులు - ఆయనకు ముందే ఎన్నడో భారతదేశంలో పుట్టి ఉన్నతమార్గాన్ని అన్వేషించినవారు; తమ సత్యాన్వేషణలో అంతులేని ధైర్యం ప్రదర్శించినవారు.

"రామమోహనుడు జీవించిన కాలం సంకుచితమైన ప్రాంతీయ దురభిమానాలతో నిండిన అంధకారయుగం. అప్పట్లో ఆయన తనను అర్థంచేసుకోని ప్రజలకు - ప్రాచ్యపాశ్చాత్యాల ఉన్నతాశయాలను ఎంతో

సానుభూతితోనూ, వివేకంతోనూ అర్థంచేసుకోగల బుద్ధిని కానుకగా ఇచ్చాడు; గొప్పవైన నాగరకతాయుగాలు తేలియాడే సంస్కృతుల సంగమాన్ని ఆవిష్కరించే బుద్ధిని ప్రసాదించాడు. ఇది ఎంతో ఆశ్చర్యంకలిగించే విషయం. ఆధునికయుగం తన అర్హతతోనూ, వైవిధ్యంతోనూ ఆయన మనోనేత్రాలముందు స్పష్టంగా కనిపించింది.

ఆ ఆధునికయుగం తన హృదయాన్ని సంపూర్ణంగా తెలుసుకోవడానికి ముందే, ఆయనే దాన్ని తన దేశానికి పరిచయం చేశాడు.''

---

# రామమోహనుడి జీవితంలో ప్రాముఖ్యంగల తేదీలు, సంఘటనలు

**1772 :** మే 22 న రాధానగర్‌లో జననం.

**1809 :** రంగపూరులో కలెక్టర్ జాన్ డిగ్బీ దగ్గర దివాన్‌గా నియమనం.

**1815 :** కలకత్తాలో కాపురం పెట్టాడు.
ఆత్మీయ సభ స్థాపించాడు.
వంగభాషలో 'వేదాంతగ్రంథ' రచించాడు

**1816** వేదాంతాన్ని సంగ్రహంగా 'అబ్రిడ్జ్‌మెంట్ అఫ్ వేదాంత' లేదా 'వేదాంత సార్' అనే పేరిట వంగ, హిందూస్థానీ, ఆంగ్ల భాషలలో ప్రచురించాడు
'కేన', 'ఈశ' ఉపనిషత్తులను వంగ, ఆంగ్ల భాషలలోకి అనువదించాడు,

**1817 :** హిందూకళాశాల స్థాపింపబడింది.
మాండూక్యోపనిషత్తును, కఠోపనిషత్తును వంగభాషలోకి అనువదించాడు.

**1818 :** సతి గురించిన తొలి రచన ప్రచురించాడు.

**1820 :** 'ఏసు బోధనలు' ప్రచురించాడు

**1821** - రెవరెండ్ విలియమ్ ఆదమ్ ఏకేశ్వరోపాసనా విధానం(Unitarianism) లోకి మారాడు.
'సంబద్ కౌముది' ప్రారంభించాడు.

**1822 :** 'మీరట్ ఉల్ అఖ్‌బార్' ప్రారంభించాడు
ఆంగ్లో-హిందూ పాఠశాల ప్రారంభించాడు.
'ప్రాచీన స్త్రీల హక్కుల గురించి సంగ్రహ సూచనలు' (Brief Remarks on Ancient Female Rights) ప్రచురించాడు.

**1823 ;** పత్రికా శాసనానికి వ్యతిరేకంగా సుప్రీమ్ కోర్టుకు విజ్ఞాపన సమర్పించాడు
'మీరట్ ఉల్ అఖ్‌బార్' ప్రచురణ ఆగిపోయింది.
'ఎంతో ఉదారమైన, వికాసం కలిగించే విద్యావిధానం' పెంపొందింపబడా లంటూ అమ్‌హెర్‌స్ట్‌కు లేఖ.

1824 : పారిస్‌లోని సొసైటీ ఏషియాటిక్' సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

1826 : వేదాంత కళాశాలను స్థాపించాడు.

1828 . లార్డ్ విలియమ్ బెంటింక్ గవర్నర్ జనరల్‌గా కలకత్తాకు వచ్చాడు.
బ్రహ్మసభ స్థాపించాడు.
'జూరీద్వారా న్యాయవిచారణ' జరగాలన్నాడు.

1830 . నవంబర్‌లో ఇంగ్లండుకు ఓడలో ప్రయాణం చేశాడు.

1831 : ఏప్రిల్‌లో ఇంగ్లండు చేరాడు.
లండన్‌లో జెరెమీ బెంతామ్‌ను కలుసుకున్నాడు.
ఈస్ట్ ఇండియా కంపెనీతో విందారగించాడు.
నాలుగవ విలియమ్ రాజును కలుసుకున్నాడు.
పాస్‌పోర్టు విధానాన్ని రద్దు చెయ్యాలనీ, సర్వదేశ సంస్థ రూపొందాలనీ టాలిరాండ్‌కు వ్రాశాడు.

1832 . సంస్కరణ బిల్లును తీవ్రంగా సమర్థించాడు. అది ఆమోదింపబడింది.
పారిస్‌కు వెళ్ళాడు. ఫ్రాన్స్ రాజు లూయీ ఫిలిప్‌ను కలుసుకున్నాడు.

1833 : లండన్‌నుంచి బ్రిస్టల్ సమీపంలో ఉన్న స్టేపిల్‌టన్ హిల్‌కు వెళ్ళాడు
సెప్టెంబర్ 27 న మరణించాడు.

## ఉపయుక్త గ్రంథసూచి

ఈ చిన్న ఉపయుక్తగ్రంథసూచికలో వంగభాషలోనూ, ఆంగ్లంలోను వెలువడిన రాజారామ్‌మోహన్‌రాయ్ రచనల సంకలనాలు, ఆ భాషలలో ఆయన గురించి వెలువడిన ఎన్నికచేసిన కొన్ని పుస్తకాల పట్టిక మాత్రమే పేర్కొనబడ్డాయి. వ్యక్తిగతంగా ఆయన ఈ రెండు భాషలలోనేగాక తక్కిన భాషలలోనూ వ్రాసిన రచనల గురించీ, ఆయన గురించి వెలువడిన తక్కిన రచనల గురించీ తెలుసుకోవడానికి ఆసక్తి చూపే పాఠకులు 1962 లో వెలువడిన కొలెట్ రచన 'ది లైఫ్ అండ్. లెటర్స్ ఆఫ్ రాజారామ్‌మోహనరాయ్' మూడవ ప్రచురణను సంప్రతించాలి. అందులో 'వివిధ భాషలలో రాజారామ్‌మోహన్‌రాయ్ వెలువరించిన ప్రచురణల పట్టిక' ఉంది. ఆ పట్టికను రూపొందించినవారు దిలీప్ కుమార్ బిశ్వాస్. ప్రభాత్ చంద్ర గంగూలీ. సాధారణ బ్రహ్మసమాజ్ ప్రచురించిన కొలెట్ రచనకు వాళ్లు సంపాదకత్వం నిర్వహించారు.

### బెంగాలీ

రామమోహనుడి వంగభాషా రచనల తొలిసంకలనాన్ని 1839 లో ఆనంద ప్రసాద్ బెనర్జీ ప్రచురించాడు. ఆ తర్వాత వెలువడినవి ఇవి:

'రాజారామమోహనరాయ్ ప్రణీత గ్రంథావళి'—సంపాదకులు: రాజనారాయణ్ బసు ఆనందచంద్ర వేదాంత వాగీశ్, కలకత్తా 1880.

'రాజారామమోహనరాయేర్ సంస్కృత ఓ వంగాళ గ్రంథావళి' [రాజారామ మోహనరాయ్ సంస్కృత. బెంగ గ్రంథావళి]—పాణిణి ఆఫీస్ ద్వారా ప్రచురితం, అలహాబాద్, 1905.

'రామమోహన్ గ్రంథావళి'—సంపాదకులు: బ్రజేంద్రనాథ్ బెనర్జీ, సజనీ కాంత దాస్, కలకత్తా, 1359 B. S.

### ఆంగ్లం

రామమోహన్‌రాయ్ ఆంగ్లరచనల సంకలనాల ప్రచురణలు[ప్రచురింపబడినవి] ఇవి:

రాజారామమోహనరాయ్ ఆంగ్లరచనలు (The English works of Raja Rammohan Roy)—సంపాదకుడు: జోగేంద్ర చంద్ర ఘోష్. సంకలనకర్త, ప్రచురణకర్త: ఈశాన్ చంద్రబోస్, సంపుటి I, ఓరియంటల్ ప్రెస్, కలకత్తా, 1885.

'రాజారామమోహన్‌రాయ్ ఆంగ్ల రచనలు' (The English works of Raja Rammohan Roy)—సంపాదకుడు: జోగేంద్ర చంద్ర ఘోష్. శ్రీ కాంతారాయ్ ద్వారా మూడు సంపుటాలలో మళ్లీ ప్రచురింపబడింది, కలకత్తా. 1901.

'రాజారామమోహన్‌రాయ్ ఆంగ్లరచనలు' (The English works of Raja Rammohan Roy)—మరికొన్ని అదనపు లేఖలతోనూ, 'తుహ్ఫత్-ఉల్-మువాహిదీన్' యొక్క ఆంగ్లానువాదంతోనూ వెలువడిన కూర్పు. పీఠికా కర్త: రామానంద ఛటర్జీ, పాణిణీ ఆఫీస్, అలహాబాద్, 1906.

'రాజారామమోహన్‌రాయ్ ఆంగ్లరచనలు' (The English wo7ks of Raja Rammohan Roy)—[ఏడు భాగాలలో] - సంపాదకుడు: కాళీదాస్ నాగ్, దేబజ్యోతి బర్మన్, ప్రస్తుతం I నుంచి VI భాగాలదాకా లభ్యమవుతున్నాయి. ప్రచురణ కర్తలు: సాధారణ బ్రహ్మసమాజ్, కలకత్తా, 1945-51.

## రామమోహను గురించి....

### బెంగాలీ

బెనర్జీ, బ్రజేంద్రనాథ్: 'రామమోహన్‌రాయ్' సాహిత్య - సాధక్ - చరిత్‌మాలా, సంఖ్య (6), 4 వ ప్రచురణ. బంగీయ సాహిత్య పరిషద్; 1358 B. S.

బసు, శశిభూషణ్: 'రాజారామమోహనరాయేర్ జీవని' (రాజారామమోహన్‌రాయ్ జీవితం), 2 వ కూర్పు కలకత్తా, 1932 B. S.

చక్రవర్తి, అజిత్‌కుమార్: రాజారామమోహన్, కలకత్తా. 1834.

చటర్జీ, నాగేంద్రనాథ్: 'మహాత్మా రాజారామమోహనరాయేర్ జీవన్ చరిత్' (మహాత్మా రాజారామమోహన్‌రాయ్ జీవిత చరిత్ర) 5 వ కూర్పు, ఇండియన్ ప్రెస్, అలహాబాద్, 1928.

దాస్. జోగేంద్ర : 'రామమోహన్ ఓ బ్రహ్మ ఆందోళన్' (రామమోహనుడు బ్రహ్మ ఉద్యమం) సాధారణ బ్రహ్మ సమాజ్, కలకత్తా, 1858 B. S.

గంగూలీ. ప్రభాత్‌చంద్ర : 'రామమోహన్ - ప్రసంగ'. సాధారణ బ్రహ్మసమాజ్, కలకత్తా, 1858 B. S.

శాస్త్రి, శివనాథ్ : 'రామమోహన్‌రాయ్', కలకత్తా, 1886.

సెన్‌శాస్త్రి, క్షితిమోహన్ : 'యుగగురు రామమోహన్, కలకత్తా, 1952.

ఠాగూర్, రవీంద్రనాథ్ : 'భారత పథిక్ రామమోహన్‌రాయ్', విశ్వభారతి, 1 66 B. S.

బాల్, ఉపేంద్రనాథ్ : 'రామమోహన్‌రాయ్ : ఆయన జీవితం, రచనలు, ఆలోచనలు మొదలైన వాటి గురించిన పరిశీలన' [Ramamohan Roy ; A study of his Life, Works and Thoughts] యు. రాయ్ అండ్ సన్స్ కలకత్తా, 1938.

బెనర్జీ, బ్రజేంద్రనాథ్ : ' ఇంగ్లండుకు రాజారామమోహన్‌రాయ్ రాయబారము [Raja Ramamohan Roy's Mission to England.] ఎన్. ఎమ్. రాయ్‌చౌదురి అండ్ కంపెనీ కలకత్తా, 1926.

కార్పెంటర్, లంట్ : రాజారామమోహన్‌రాయ్ కృషి, అభిప్రాయాలు, సౌశీల్యం' మొదలైన వాటి పరామర్శ - బ్రిస్టల్‌లోని లూయిన్ మీడ్ చాపెల్‌లో రామమోహనుడి మరణ సందర్భంగా చేసిన ఉపన్యాసం [A Review of the labours, Opinons and Character of Raja Ram mohan Roy in a Discourse on Occasion of Death‹ Delivered in Lewin's Mead Chapel, Bristol]: ఆయన (రామమోహనుడి) రచనలనుండి కొన్ని సోదాహరణ భాగాలు [A servies of illustrative Extracts from his writings]; జీవిత చరిత్రాత్మకమైన సంస్మరణ, దాంతోబాటు ఏషియాటిక్ జర్నల్‌లో వెలువడిన నిందాపూర్వకమైన అభిప్రాయాల పరిశీలన [A biographical Memoir to which is subjoined an Examination of some Derogatory Statements in the Asiatic Journal] - లండన్. బ్రిస్టల్, 1833.

కార్పెంటర్, మేరీ : 'ఇంగ్లండులో రాజారామ్‌మోహన్‌రాయ్ చివరి రోజులు' [last

Days in England of the Rajah Ramamohan Roy] లండన్, 1866. కలకత్తాలోని రామమోహన్ గ్రంథాలయం ద్వారా పునర్ముద్రితం. 1915.

చక్రవర్తి, సతీష్‌చంద్ర (సంపాదకుడు): 'ఆధునిక భారత పిత: రామమోహన్‌రాయ్ శతజయంతి ఉత్సవ సంచిక' [The Father of Modern India : Commermoration Volume of the Ramamohan Roy Centenary Celebrations], 1933, కలకత్తా. 1935.

చటర్జీ, రామానంద : 'రామమోహన్‌రాయ్ - ఆధునిక భారతదేశం' [Rammohan Roy and Moderan India]. 1918.

కాలెట్, సోఫియా డాబ్సన్ : 'రాజారామమోహనరాయ్ జీవితం, రచనలు' [The life and letters of Rammohan Roy]. 3 వ కూర్పు. సాధారణ బ్రహ్మసమాజ్; 1962.

గంగూలీ, నరన్‌చంద్ర : 'రాజారామమోహనరాయ్'. ఆధునిక భారత నిర్మాతలు పరంపర. వై. యం. సి. ఏ, ప్రచురణలు, కలకత్తా, 1934,

హోమ్. అమల్ : 'రామమోహన్‌రాయ్ : వ్యక్తి, ఆయన కృషి' [Rammohan Roy : The man and his work] కలకత్తా. 1933. ఇది రామమోహన్‌రాయ్ శతజయంతి ఉత్సవ సంచికలో చేర్చబడింది.

మజుందార్, జితేంద్రకుమార్ చందా, రామప్రసాద్ (సంపాదకులు) : రాజారామమోహన్‌రాయ్ జీవితానికి సంబంధించిన లేఖలు, పత్రాలు సంపుటి I [Letters and documents relating to the life of Raja Rammohan Roy Vol I] (1791-1830) ఓరియంటల్ బుక్ ఏజన్సీ, కలకత్తా, 1938.

మజుందార్, జితేంద్రకుమార్ (సంపాదకుడు) : 'రాజారామమోహన్‌రాయ్, చివరి మొఘలులు - అధికార పత్రాలనుంచి చేసిన సేకరణ (1803-1839) చరిత్రాత్మకమైన పీఠికతో' [Raja Bammohan Ray and the last Moghuls : A selection from Official Records, 1803 -1839 with an Historical Introduction] ఆర్ట్ ప్రెస్, కలకత్తా, 1939.

మజుందార్. జితేంద్రకుమార్ (సంపాదకుడు) : రాజారామమోహన్‌రాయి - భారత దేశంలోని అభ్యుదయ ఉద్యమాలు అధికార పత్రాలనుంచి చేసిన సేకరణ, 1775-1845, చరిత్రాత్మకమైన పీఠికతో [Raja Rammahan Roy and progressive movements in India : A selection from records, 1775-1845, with an Historical Introduction] ఆర్ట్ ప్రెస్, 1941.

మాక్స్ మ్యులర్, ఎఫ్ ; 'జీవిత చరిత్రాత్మక వ్యాసాలు' [Biographical Essays] లాంగ్‌మన్స్, లండన్, 1884.

మ్యూవోర్, అడ్రియెన్ [Muore, Adrienne] : 'రామమోహన్‌రాయ్ - అమెరికా' [Rammohan Roy and America]. సాధారణ బ్రహ్మసమాజ్ కలకత్తా, 1942.

సమద్దర్. ఆర్. ఎన్ : రాజారామమోహన్‌రాయ్, 1911.

సీల్, బ్రజేంద్రనాధ్ : 'రామమోహన్‌రాయ్ - విశ్వమానవుడు, [Rammohan Roy, the Universal Man]. సాధారణ బ్రహ్మసమాజ్. ప్రచురింపబడిన సంవత్సరం పేర్కొనబడలేదు.